# గాలిమేడలు

## A COMEDY OF TEARS

అనిసెట్టి సుబ్బారావు

దేశికవితామండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ: వెయ్యి ప్రతులు
నాటక రచన : డిశంబరు 1949
మొదటి ప్రదర్శన: ఆగష్టు 1950
ప్రథమ ముద్రణ, జనవరి 1953
కిసాన్ ప్రెస్, విజయవాడ.
హక్కులు రచయితవి.
వెల : రూపాయి [illegible]



సంపాదకులు:
బొందలపాటి శకుంతలా దేవి
శివరామకృష్ణ

ఆంధ్ర ఆర్ట్స్ థియేటరు ఆధ్వర్యాన మొదటి మూడుసార్లు
విజయవాడలో ప్రదర్శించినప్పుడు పాల్గొన్న నటీనటులు :

| | |
|---|---|
| మాణిక్యాలరావు : | శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి |
| అన్నపూర్ణ : | శ్రీమతి సుశీల |
| కృష్ణ : | ప్రతాప్ |
| మానేజింగ్ డైరెక్టరు :<br>కాబూలీవాలా :<br>నారాయణరావు : | శ్రీ నాగభూషణం |
| ఆంజనేయులు :<br>సీతారామయ్య :<br>హోటల్ యజమాని : | శ్రీ లక్ష్మీనరసయ్య |
| పోలీస్ ఆఫీసర్ :<br>నరసయ్య :<br>వెంకట్రావు : | శ్రీ సత్యనారాయణ |
| వైటర్ : | శ్రీ అప్పలస్వామి |

సంగీతం : మోహన్ దాస్

సెట్స్ : స్క్రీన్ ఆర్ట్స్, విజయవాడ.

—*—

# నాటక ప్రదర్శనకు

## సూచనలు

- ఆంజనేయులు, సీతారామయ్య. హోటల్ యజమాని పాత్రలను ఒకరు; మానేజింగ్ డైరెక్టరు, కాబూలివాలా, నారాయణరావు పాత్రలను ఒకరు; పోలీస్ ఆఫీసరు, నరసయ్య, వెంకట్రావు పాత్రలను ఒకరు నటించాలి.

- వాస్తవిక జీవితంలో మొదటి చివరి భాగాలకు రంగం ఒకేవిధంగా అలంకరించ బడాలి. ఏమాత్రం మార్పులుండగూడదు.

- అన్నపూర్ణ లాంతరు తీసుకుపోయినప్పుడు రంగంమీద క్రమంగా వెలుతురు తగ్గిపోయి, చివరి దృశ్యంలో ఆమె లాంతరు తెచ్చి నప్పుడు క్రమంగా హెచ్చాలి.

- వీలైనంతవరకు స్వాప్నిక జీవిత దృశ్యాలలో స్వప్నవాతావరణం లైటింగ్ ఎఫెక్ట్స్ ద్వారా కలిగించాలి.

- మొదటిరంగం అయిపోగానే తెల్ల తెరమీద మాణిక్యాలరావు పడక కుర్చీలో నిద్రపోయే ఛాయను చూపించి, అతని ఛాయ లేచి వెనుకవున్న కుటీరాలను విడిచి, ఎదుటవున్న భవనాల్లోకి ప్రవేసిస్తున్నట్లుగా చూపించాలి. చివరి సీనుకుముందు అదేఛాయ తిరిగి భవనాలలోనుంచి తూలుతూవచ్చి కుటీరాలలోకివచ్చి పడకకుర్చీలో పడుతున్నట్లు చూపించాలి.

- ప్రదర్శన సౌకర్యం కోసం వాస్తవ జీవితంలో మొదటి చివరి సీనులు, సత్రం సీను స్టేజికి ముందుభాగంలోను, హోటల్ సీనులు రెండూ స్టేజికి వెనుకభాగంలోను ప్రదర్శించడానికి, అందుకోసం స్టేజికిమధ్య తెరవుంచి రెండుగా విభజించడానికి ఏర్పాటుచెయ్యాలి.

- పాటలను సమయోచితమైన ఫణితులలో ప్రతిరంగానికి మధ్య పాడాలి.

పరిదర్శకుల, పాఠకుల సౌకర్యంకోసం మొదటి పరిద
## సమీక్ష
ర్శనంతర్వాత కృష్ణాపత్రికలో శ్రీ నేమాని ఆంజనేయ
శర్మగారు ప్రకటించిన సమీక్షలో కొన్ని భాగాలు]

శ్రీ అనిశెట్టి సుబ్బారావుగారు ఈ నాటకాన్ని రచించారు. ఆంధ్ర నాటక రంగంలో కలుగుతూవున్న అభివృద్ధికి ఈ నాటకము ఒక మచ్చుతునక.

మన సమాజంలో స్వప్నాలు అంటే రకరకమైన అభిప్రాయాలు ప్రబలిఉన్నవి. ఈ స్వప్నాలు భవిష్యత్తును సూచిస్తవని కొందరంటే, ఈ స్వప్నాలకు విశేషమైన అర్థాలను కల్పించి తద్వారా ఊహాసౌధాలను నిర్మించుకొని సుఖ దుఃఖానుభూతులను పొందుతున్నారు కొందరు. కాని ఫ్రాయిడ్ అనే మనోవైజ్ఞానిక శాస్త్రవేత్త ఈ స్వప్నాల రహస్యాలను కనిపెట్టారు. వాస్తవిక జీవితంలో మనకు అనేక రకాలైన కోరికలు కలుగుతూ ఉంటవి. కాని వాటిలో బహుభాగం కోరికలు తీరేఅవకాశం ఉండదు. ఆ తీరనికోరికలే స్వాప్నిక జగత్తులో కొత్తరూపం ధరిస్తున్నవి. అవే స్వప్నాలు అని ఫ్రాయిడ్ స్థిరీకరించారు. వాస్తవిక జీవితంలో ఏ వ్యక్తులనుచూస్తే రాగద్వేష భయాదులు కలుగుతున్నవో, ఎవరి లేక ఏ ఏ ఘట్టాల ప్రభావం హృదయాల మీద హత్తుకుంటున్నదో ఆ వ్యక్తులూ ఆ ఘట్టాలు వేరు వేరు రూపాలతో ప్రత్యక్షం కావడం సంభవిస్తున్నదని ఆయన నిర్ణయించారు. విజ్ఞాన జగత్తులో నేటివరకూ స్వప్నాలనుగురించి స్థిరీకరింపబడిన నిర్ణయం ఇది ఇక్కడే కనుక స్వాప్నికజగత్తులో కలిగే అనుభవాలూ, ఆరాటాలు వాస్తవిక జగత్తుతో సంబంధించినవేకాని వేరైనవి కావు అనే నిర్ణయాన్ని ఈ నాటక రచయిత అనుసరించాడు. బ్యాంకుడబ్బు కాజేసి అయినా జీవితంలో సుఖపడదామనేది మాణిక్యాలరావు అనుకున్న కోరిక. ఆ కోరిక ఎంత బలవత్తరమైనదో, ఆంజనేయులూ, బ్యాంకు మేనేజరూ, ప్రభుత్వమూ అంటే అతనికున్న భయంకూడా అంత బలవత్తరమైనదే. ఈ భయంముందు ఆ కోరిక తీరనికోరికగా వుండిపోయింది. ఇటు ఆ కోరిక తీర్చుకొంటే ఈ పెద్దలు ఏలాంటి కష్టాలపాలుజేస్తారోననే భయం, అటు సుఖపడదామనే కోరికా ఈ రెండిటి సంఘర్షణలో—ద్వంద్వంలో— అతని జీవితం నడుస్తున్నది. వాస్త

విక జగత్తులోని ఇదేస్థితి స్వప్నజగత్తులో కూడా అతనికి ప్రత్యక్షమయింది. ఈ సత్యాన్ని ఈ నాటకం ఎంతో బాగా ప్రతిబింబించగలిగింది. రెండో కుమారుని పోషించలేక అత్తవారింటికి పంపించినా మాణిక్యాలరావు అంతరాంతరాళ్ళలో గుప్తంగా ఆ పిల్లవాని మరణకాంక్ష గూడా లేక పోలేదు. అందువల్లనే అతని స్వప్నంలో పిల్లవాని మరణవార్తను గూర్చిన టెలిగ్రాంకు స్థానం ఏర్పడింది. ఇదీ ఈ నాటకానికి పునాదులు

స్వప్నం అంతా మూడు ఘట్టాలుగా చిత్రించబడింది. మొదటి ఘట్టంలో ఆంజనేయులూ, బ్యాంకు మేనేజరూ, పోలీసు సూపరింటెండెంటూ తమ తమ స్వప్న రూపాలతో నే కన్పించారు. రెండో ఘట్టంలో ప్రవృత్తి, స్వభావము అవేఅయినా ఆ వ్యక్తులే సత్రపు కాపరి, కాబూలీవాలాల లాగ ప్రతిబింబించారు. వారే మూడో ఘట్టంలో వెంకట్రావూ అతని స్నేహితుడూ, హోటలు యజమానిలాగా కన్పించారు. ఈ మూడు ఘట్టాలలో వచ్చిన వ్యక్తులు సీతారామయ్యా, వెంకట్రావులాంటి వేరువేరు పేర్లతో వేరు వేరుగా ఉన్నా మొత్తంమీద వారందరూ మాణిక్యాలరావు వాస్తవిక జీవితంలో అతన్ని భయపెడుతున్నా — అతని కోరికలను అణచివేస్తూ ఉన్న ఆంజనేయులూ, బ్యాంకు మేనేజరూ, పోలీసు సూపరింటెండెంట్లు (ప్రభుత్వము) త్రయమే.

ఇలాంటి శాస్త్రీయ దృక్పథాన్ని నాటకరంగంలో ప్రవేశపెట్టి ఆంధ్ర నాటకరంగానికి కొత్త అలంకారం తెచ్చుకొనివచ్చిన అనిశెట్టివారికి అభివందనాలు. ఈనాడు మనకు ఇలాంటి నాటకాల అవసరం ఎంతైనా ఉన్నది. కేవలం భావజగత్తేగాక వాస్తవిక జీవితాన్ని శాస్త్రీయ దృక్పథంతో వివరించబూనడం, తద్వారా దేశానికి దివ్యసందేశాన్ని అందజేయడం, జీవితపు పునాదులను దృఢపరచడం ఎంతో అవసరం.

పాత్ర చిత్రణ : ఈ నాటకంలోని పాత్రలన్నీ సజీవమూర్తులుగా హృదయాలను స్పందింపజేస్తున్నవి. మధ్యతరగతివారు ఆర్థికంగా ఎలాంటి బాధలు పడుతున్నారో, నేటి ఆర్థికవిధానం కారణంగా ఎన్ని నవయువక హృదయాలు క్రుంగి కృశించిపోతున్నాయో, ఆర్థికశక్తి సహజ మానవత్వాన్ని, మానవునిలోని దైవగుణాలను నశింపజేసి, మానవునిలోని అవకాశంకోసం పొంచుండి కూర్చున్న పశుప్రవృత్తిని ఎలా ఉద్రేకింపజేస్తుందో కళ్లకు కట్టినట్టుగా ఈ నాటకంలోని పాత్రలు చూపెడుతున్నవి. స్వప్నజగత్తు కూడా

వాస్తవిక జగత్తుగానే చిత్రింపబడింది స్వప్న జగత్తు వాస్తవిక జగత్తుకు ప్రతి బింబమేకదా! అన్నపూర్ణ తొమ్మిది అరటిపళ్ళలో రెండు తనకిచ్చి, మూడు పిల్లవానికిచ్చి, నాలుగు తాను తీసుకుంటే సహించలేదు మాణిక్యాలరావు. ఏ భార్యాపిల్లలకోసం తన సర్వశక్తిని ధారపోస్తున్నాడో ఎవరి సుఖసంతోష చంద్రికలకోసం తాను తానుగొప్ప జీవితం గడుపుతున్నాడో, వాటి త్యాగబుద్ధి భరించలేక రెండు అరటిపండ్లు తనకంటే ఎక్కువ తీసుకుంటే అతని లోని పశుప్రవృత్తి ప్రకోపించింది. తన భర్త భోజనంలేకుండా తిరిగివచ్చినా— అతని కష్టాలను తాను కన్నులార చూస్తున్నా—ఎక్కువగ అరటిపండ్లు అతని కివ్వలేకపోయింది అన్నపూర్ణ. జీవితం కటుసత్యం. కటుసత్యం కటుజీవితం. బెంగాలులో వేలాది జనులు ఆకలిబాధకు చచ్చిపోయినపుడు మానవునిలో వుండే సహజ ప్రేమబంధాలు ఆకలిబాధకు ఎలా చిన్నాభిన్నాలైపోయి వనో పత్రికలలో చదివాము. కథలు విన్నాము. కన్నీరు కార్చాము. ఇదీ మానవుని వాస్తవిక జీవితం. ఈ రెండు జీవితాలకూ సమన్వయం కుదరడం లేదు. ఒకటి ఆదర్శమైనదైతే రెండోది వాస్తవమైనది. ఈ రెండింటికీ సమ న్వయంలేకనే మానవజీవితం నికృష్టమైపోతున్నది. ఇదే ఈనాటి మన సమస్య. వాస్తవిక జీవితాన్ని కాదనలేము. ఆదర్శాన్ని సాధించలేము. ఈ భయంకర సమస్య పరిష్కారమైతేనే మానవ జీవితానికి వికాసం

అన్నపూర్ణ భర్తకోసం ఎదురుచూస్తూ వుంటుంది సత్రంలో. ఆమె దగ్గర నారింజపండు ఒకటి వుంటుంది. భర్త రాగానే ఆ నారింజపండు గొడుగుచాటున దాచిపెడుతుంది. ఆ పండును తనకులేకుండా భర్త తీసు కొంటాడని ఆమె భయం. భర్తకు కళ్ళుతిరిగి డ్రాయర్ మీద పడిపోతే అప్రయత్నంగా ఆ నారింజపండును తెచ్చి భర్తకు అందిస్తుంది. యీ సన్ని వేశం ఎంతో హృదయంగమంగా వుంది. భారతీయ స్త్రీత్వాన్ని చక్కగా స్పష్టీకరించింది. ప్రతి పాత్రనూ చిత్రించడంలో నాటక రచయిత ఎంతో జాగ్రత్తను వహించాడు. మానవుడు స్వయంగా మంచివాడు. మానవత్వం ఉజ్జ్వలమైనది, పవిత్రమైనది. కాని పరిస్థితులు మానవుణ్ణి మార్చివేస్తున్నవి. అతనిలోని దయాశీలాశౌచాదులను అణచివేస్తున్నవని యీ నాటకంలోని పాత్రలు ఉద్ఘాటిస్తున్నవి. అన్ని పాత్రలు సజీవంగా వున్నవి. డబ్బుకు సంఘంలో ఎలాంటి విలువ ఏర్పడిందో, ఏదోవిధంగా డబ్బు సంపాదించిన వాడు సంఘంలో ఎలా గొప్పవాడుగా పరిగణింపబడుతున్నాడో కూడా

బాగా చిత్రింపబడింది. రెండు రూపాయలు అప్పు ఇవ్వడానికి వెనుకాడిన వెంకట్రావు, మొదటి బహుమతిగా ఖైనేల రూపాయలు వస్తవని తెలియగానే తనవే ఎనిమిది వందలు ముందుగానే ఖర్చుపెట్టాడు. యీ ఎనిమిది వందలను పెట్టుబడిగా వినియోగించి గూడ్స్ క్లర్క్ రావు స్థాపించబోయే కంపెనీలో భాగం సంపాదించాలని వాడి ఆరాటం. రెండవ స్నేహితుడు ఐదు వందల రూపాయలు అందకుండానే తెలివిగా ఇచ్చాడు, విచిత్రమైన మనస్తత్వం! విచిత్రమైన సన్నివేశాలు!

స్వార్థం, ద్రోహబుద్ధి, ధనసమూహ ఆర్థికశక్తికి మాత్రమే ప్రాధాన్యమిచ్చే యీనాటి సాంఘికవ్యవస్థ మారితీరవలెనని యీ నాటకం సందేశాన్నిస్తున్నది.

కొత్త విషయాలు : యీ నాటకంలో ప్రేక్షకులు, రంగస్థలం మీది పాత్రలు పరస్పరం మాట్లాడుకోవటం కొత్తగా ప్రవేశపెట్టబడింది. ఇటు రంగస్థలంమీది నటకులు, అటు ప్రేక్షకులు అందరూ నాటక ప్రదర్శనంలో భాగస్వాములు కావటం, వారూ వీరూ కలిసి నాటకాన్ని ప్రదర్శించడం ఒక కొత్త కళ. పాశ్చాత్యదేశాలలో ఇలాంటి ప్రయత్నాలు జరుగుతూ వున్నవి. మనదేశంలో గూడ అనిశెట్టివారు యీ నాటకంద్వారా ఆ ప్రయత్నం ప్రారంభించారు. శాస్త్రీయ దృక్పథంతో జీవితాన్ని చిత్రించడం ప్రేక్షకులను గూడ నాటకంలో పాత్రధారులనుగా చేయడానికి ప్రయత్నించడం, యీ రెండూ యీ నాటకంలోని కొత్త విషయాలు.

ప్రదర్శనం : ప్రతి నాటకాన్ని ఉత్తమ కళాఖండంగా తయారు చేయడానికి ప్రదర్శకు లెక్కువ శ్రద్ధవహిస్తేనేగాని ప్రయోజనం వుండదు. దృశ్యానికి దృశ్యానికీ మధ్య ఆలస్యం జరిగితే ఇలాంటి నాటకాలు బ్రతకవు. ఏ ఘటనకాఘటన వేరుగా వున్నప్పుడు 'టెంపో' ఏర్పడడానికి దృశ్యాలు తొందర తొందరగా ప్రదర్శించబడాలి. ఇది స్వప్నం అని ప్రేక్షకులకు తెలిసినప్పుడు వారి కాశ్చర్యం కలగాలి. అందుకు తగిన వాతావరణం క్రమంగా ఏర్పడాలి. క్లైమాక్సు (అంతిమ బిందువు) ద్రష్టలను ఆశ్చర్యచకితుల్ని చేయాలి.

ఆంధ్ర నాటకరంగం కొత్త పోకడలు పోతూవున్నది. కొత్త రాచబాటలమీద పయనిస్తున్నది. ఆ పయనంలో ఈ నాటకం ఒక మైలురాయి.

[కృష్ణా పత్రికాధిపతులకు కృతజ్ఞతతో...]

# గాలిమేడలు

## వాస్తవ జీవిత దృశ్యం :

[మొదటి భాగం]

[ఒక చిన్న బస్తీలో బ్యాంకు గుమాస్తా మాణిక్యాలరావు అద్దె కుంటున్న పెంకుటింటిలో హాలు. ఒక చెయ్యివిరిగిన కుర్చీ, పక్కనే ఒక డ్రాయరు, దానిమీద అద్దం, దువ్వెన మొదలైనవి. దండెంమీద చినిగిన బట్టలు, గోడకు ఫోటోలు, అన్నీ చితికిపో తున్న మధ్యతరగతి కుటుంబీకుని ఇంటి పోలికలు.

హాలులో ముందుభాగాన ఒక పడక కుర్చీ ఉన్నది.

దీపాలవేళ. డ్రాయరుమీద ఆకారం గడియారం 7 గంటలు చూపుతున్నది, కిరోసిన్ లాంతరు వెలుగుతున్నది.

అన్నపూర్ణ ఒకటిరెండు చినిగిన వస్త్రాలు దగ్గరవేసుకుని చింకి చాప మీద కూర్చుని కుట్టుతున్నది.

కృష్ణ పరుగెత్తుకొని లోపలికి వస్తాడు. రంగువెలిసిన పొట్టి నిక్కరు, నిక్కరు లోపలికి దోపిన చొక్కా, నడుముకు బెల్టు, చేతిలో క్లాసు పుస్తకాలు. ఏదో సినిమా పాట గొణుక్కుంటూ వచ్చి, పుస్తకాలు డ్రాయరుమీద పెట్టేస్తాడు.]

అన్నపూర్ణ : ఇంతసేపూ ఎక్కడున్నావ్ కృష్ణా?

కృష్ణ : స్కూలులో ఆడుకుంటున్నా అమ్మా.

అన్న: దీపాలుపెట్టి గంట అయితే పట్టుట్రా నీ ఆటలూ నువ్వూ.

కృష్ణ : ఎందుకమ్మా అంత కోప్పడతావ్! నాన్నేరి? నాకు బాడ్మింటన్ బాటు తెస్తానన్నాడుగా, తెచ్చారా?

అన్న: నాన్న ఇంకా బ్యాంకునుంచి రాలేదు.

కృష్ణ: (దిగులుగా) రాలేదు! రాలేదు! నాకేదన్నా కొని పెట్టమంటే ఇంటికి రానేరారు!

అన్న: కొంటారులే నాన్నా, రేపూ....

కృష్ణ: మళ్ళీ రేపన్నావ్! ప్రొద్దున అడిగితే సాయంత్రమంటారు, సాయంత్ర మడిగితే రేపంటారు!

అన్న: (నవ్వునటిస్తూ) అబ్బ! అంత గోలచేస్తే ఎలారా...

కృష్ణ: (బిక్కమొహం పెట్టి) నేనా గోలచేసేది! నేనెప్పుడైనా గోల చేస్తానూ? నాన్న ఎంతగోలచేసినా అనవుగాని, నేనేదైనా అడిగితే అందరికీ కోపమే...

అన్న: తొందర పడితే ఎలామరి!

కృష్ణ: మా స్కూల్లో రేపే మీటింగు. నాకు శిల్కుచొక్కా కుట్టిస్తానంటివే!

అన్న: (భయంతో) రేపేనా?

కృష్ణ: వారం రోజులున్నుంచి చెపుతున్నా.

అన్న: నేను మరచి పోయాను. నాన్నగారు రాగానే చెప్పి తప్పకుండా...

కృష్ణ: నాన్న కొనిపెట్టకేం, నాన్ననాతో మాట్లాడనేమాట్లాడరు!

అన్న: ఎందుకు మాట్లాడరురా...

కృష్ణ: (సీరియస్‌గా) అమ్మా! నే నొకటడుగుతా చెప్పు!

అన్న: ఏమిటది?

కృష్ణ: నాన్నకూ నీకూ నేనంటే ఇష్టంలేదు, కదమ్మా?

అన్న- (బాధతో) అదేమిట్రా! నీ మీద మాకుగాక ఇంకెవరి కుంటుందరా! చూడు! మళ్లీ సోమవారం నాటికి నీకేమేం

కావాలో అన్నీ... (తలనిమురుతూ) డబ్బింకా అందలేదు నాన్నా!

కృష్ణ: ఊ! అది! నే నేదడిగినా అదేమాట!

అన్న: చిన్నవాడివి నీకేం తెలుస్తుందిరా!

కృష్ణ: నాన్నతో గట్టిగా చెప్పమ్మా.

అన్న: రోజూ చెపుతూనే వున్నా!

కృష్ణ: అయితే నాకిప్పుడొక పావలా ఇవ్వు, సినిమా కెళ్ళొస్తా.

అన్న: అలాగే, రేపూ—

కృష్ణ: (బిక్కమొఖంతో వెళ్ళిపోతూ) రేపు! రేపు, రేపు! నా సంగతి నాన్నగారితో చెప్పి పోట్లాడమ్మా!

అన్న: (నవ్వుతూ) ఇద్దరం కలిసి పోట్లాడదాం లేరా! (వెంటనే దుఃఖంతో కండ్లు తుడుచుకుంటుంది)

[బైటనుంచి మాణిక్యాలరావు కేక వినిపిస్తుంది. 'తలుపుతీయ్! విన్నే! ఓమ్! తలుపుతీయ్!']

అన్న: (జవాబిస్తూ పెద్దగా) రండి! తలుపు తీసేవుంది.

[అన్నపూర్ణ పడక కుర్చీమీదవున్న పుస్తకాలు, గుడ్డలు, దినపత్రిక తీసి అవతలపెట్టి గుడ్డతో శుభ్రం చేస్తుంది. మాణిక్యాలరావు లోపలికివచ్చి నిశ్శబ్దంగా కోటుతీసి వంకెకు తగిలిస్తాడు. చొక్కాకు వీపుమీద పెద్ద చిరుగు, చేయిదగ్గర మాసిక, జేబుమీద సిరామరకలు, బాగా అలిసి పోయున్నాడు. ఆమె మౌనంగా కుట్టుకుంటూ, అతనివంక చూడదు. మాట్లాడుతుందేమో అని అతను ఎదురు చూస్తాడు.]

మాణి: (నవ్వుతూ) ఇంకా అలక తీరలేదా?

అన్న: ... ...,

మాణి: ఎప్పుడో రాత్రి కొస్తానని ఇప్పటివరకూ అలిగి కూర్చున్నాన్! ఇక యిప్పుడు పోట్లాడితే రేపటివరకూ-

అన్న: (కోపంగా) చాల్లెండి! నేనెందుకు అలుగుతాను! మీ రలిగితే పలకరించేవాళ్లెవరు ?

మాణి: (వెంటనే) నేనున్నానుగా, అన్నిటికీ...

అన్న: పాపం! మీ కెప్పుడూ నా ధ్యాసే—

మాణి: (నవ్వించటానికి ప్రయత్నిస్తూ) ఏమిటి అన్నిస్తారా! మరీ చిన్నపిల్లవై పోతున్నావ్!

అన్న: మరీ... మన బాబును రప్పించమని ఎన్నిసార్లు చెప్పానండీ.

మాణి: ఉత్తరం రాశానుగా; నేను మాత్రం, మన బాబును ఎల్లకాలం మీవాళ్ళ ఇంట్లో వుంచటానికి ఒప్పుకుంటానా !

అన్న: మరి లేకపోతే ఎందుకు రాయరు! (దీనంగా) ఏం వాడు మనబిడ్డ కాడా; మనం పెంచుకోక తప్పుతుందా! అప్పుడే అయిదేళ్లు వచ్చినై; వాణ్ణి చదవెయ్యాలి!

మాణి: (కష్టాలన్నీ ఒక్కసారి జ్ఞాపకంవచ్చి) ఇప్పుడే జీతం రాళ్ళు చాలక నానా అవస్థలు పడుతుంటే ఇంకా—

అన్న: మనతోపాటే, ఉన్నదాంట్లోనే—

మాణి: ఉంటేగదా అసలు! నెల మొదటి తేదీకి ఎనభై రూపాయలొస్తే అందులో ఇరవై మీవాళ్ళకు, పాతిక మావాళ్ళకు మణియార్డర్లు!! మిగిలింది మనకు! ఏం చేస్తాం!

అన్న: ఏదో ఒకటి చెయ్యండి త్వరగా!

మాణి: (పరిహాసంగా) ఇక ఎక్కడైనా దొంగతనం చెయ్యాలి!

అన్న: (విసుగుగా) చాల్లెండి, ఆమాట నేనన్నానా !

మాణి: (సీరియస్‌గా) నువ్వెందుకంటావ్, నేనంటున్నాను ! కానీ; అలాంటి దొంగతనాలు, మోసాలు మా వంశం లోనే లేవ్ తెలుసా ?

అన్న: (కోపంగా) మా వంశంలో వున్నాయనా మీ వుద్దేశం! ఎప్పుడూ మా వాళ్ళమీద విరుచుకు పడతారేం, మీ వాళ్ళను సరిగా వుండమనండి చాలు !

మాణి: (ఉగ్రుడై) ఇదిగో, మాటకు మాట అనవద్దని ఎన్ని సార్లు చెప్పాను ! ప్రొద్దుటి నుంచి వంచిన నడుం ఎత్త కుండా నరాలు తెంచుకుని, ఎకౌంట్లురాసి, లెడ్జర్లు మోసి ఇంటికివస్తే ఒక కప్పు కాఫీ ఐనా ఇవ్వకపోగా వాదిస్తున్నావా !

అన్న: పిలిచి పోట్లాడుతుంటే నేనేం చేస్తాను !

మాణి: (విసుగ్గా మాందుకు నడుస్తాడు, అతని కండ్లకు లోక మంతా ప్రేతాల రూపంలో పాటాడ్తూగా కన్పిస్తుంది. భయంతో నిశ్చేష్టుడై తాడడు. లసగా తాను క్రింగి పోతాడు.) అన్నపూర్ణా ! ఇలారా !

(ఆమె దగ్గరకు వస్తుంది. రహస్యంగా) వీరంతా ఎవరు ? మన యింటికెందు కొచ్చారు ?

అన్న: (పరికించి చూస్తుంది. పరిహాసంగా నవ్వుతుంది.) ఎవరు? ఎవరూ లేరే ! నా కంటి కెవ్వరూ కన్పించడంలేదు.

మాణి: (బెదురుతూ) అమ్మో ! ఇంతమంది మనుష్యులా ! మన ఇంటికే ! నువ్వు ఆహ్వానించలేదు గదా ?

అన్న: (ఇంకాచూస్తూ) ఎవరున్నారండీ, మీదంతా భ్రమగాని!

మాణి: (చూపిస్తూ) అదుగో! అక్కడ కూచుని మాట్లాడు తున్నారు! అమ్మో! ఇంతమంది అతిధులా! మన సంసారం నిలవడానికేనా!

అన్న: (విసుగుగా) నేనెవ్వరినీ రమ్మనలేదు, అక్కడెవరూ లేరు; మీదంతా వెర్రి!

మాణి: (కోపంగా) ఇదిగో జాగ్రతగా మాట్లాడు! అంతమంది ముందు భర్తను తూలనాడు తావుగా! (మెల్లగా) మన ఇంటికెందుకొచ్చారు? చూడు, అన్నపూర్ణా! జాగ్రతగా చూడు, కన్పిస్తారు.

అన్న: (దీక్షగా చూస్తుంది. ఆశ్చర్య భయాలతో కంపిస్తుంది) అవునండోయ్! ఇదేమిటి ఇంతమంది స్నేహితుల్ని మీరే వెంటబెట్టుకొచ్చారేమో! మీరే అడగండి!

మాణి: అబ్బబ్బ! ఈ సంసారం అజమాయిషీతో చస్తున్నా. అన్నిటికీ నేనే! (ప్రేక్షకులను సంబోధిస్తూ, అతి మృదువుగా, దీనంగా) ఏమండీ! ఎందుకొచ్చారు?

ఒకరు: చూచిపోదామని వచ్చాం!

మాణి: థాంక్స్! మా క్షేమ సమాచారాలు విచారించడానికే వచ్చారు గదూ? అహ! అలా అడుగుతున్నానని మరోలా అనుకోకండేం! (నవ్వుతూ) మాదీ,అంత వున్న సంసారం కాదు! ఏదో గుట్టుగా గడుపుకు పోతున్నాం!

మరొకరు: పర్వాలేదు, కానివ్వండి!

మాణి: నాకు భయంగావుంది! నిజం చెప్పొద్దూ! ఈ సంసారం ఈదేటప్పటికే నా ప్రాణం ఆవిరై పోతోంది! ఇందులో మీకు తెలియని దేముంది! అందుకనీ, మీరంతా

బంధుమిత్ర సపరివారసమేతంగా రావడం చూస్తే, అతిధులుగా వచ్చారేమో అనీ—

అన్న: (భర్తతో రహస్యంగా) మెల్లగా సమాధానం చెప్పి పంపేయండి! చూడండి అతనుగాని రాలేదుగదా!

మాణి: (నవ్వుతూ) విన్నారా? అప్పులవాడు గూడా వచ్చాడేమో చూడమంటోంది! (భార్యతో) మనకేం భయంలేదు, నేనున్నాను! వీరంతా మన స్నేహితులే! (ప్రేక్షకులతో) అవునా?

ఇంకొకరు: అవునవును!

మాణి: ఈ రోజుల్లో ఎవరిని చూసినా భయం వేస్తుంది. మన కోరికలు డేగల్లాగ ఎగురుతుంటే, బ్రతుకులు బావుల్లో కప్పల్లాగ కొట్టుకుంటాయ్!

ఒకరు: ఇంతకూ మీపేరేమిటండీ?

మాణి: నాపేరు మాణిక్యాలరావు అంటారులెండి!

అన్న: (ఎగతాళిగా) పూర్తిపేరు చెప్పండి!

మాణి: (ధైర్యం నటిస్తూ) చెపుతా, నాకేం! (ప్రేక్షకులతో దర్జాగా) వీర, వెంకట, రత్న, రాజ, మాణిక్యాలరావ్!

అన్న: (భర్తను పరిహసిస్తూ, ప్రేక్షకులతో) చాలా పెద్దపేరు లెండి!

మాణి. (దీనంగా) అయితే ఉద్యోగం మాత్రం చాలా చిన్నది! కాని మా సంసారానికి బోలెడు ఆశలు, బండెడు అవస్థలు! ఇందులో మీకు తెలియని దేముంది!

అన్న: అందరికీ అంతే! ఇక అసలు విషయం చెప్పండి! ఊఁ?

మూర్తి: (భార్యతో) ఏమిటే, నా స్వప్నాలా ? హాస్యా: బాగుంటుందా !

అన్న: ఆం రోజూ మీ కలలన్నీ చెప్పి నా ప్రాణం తీస్తారుగాని, వాళ్ళతో చెప్పడానికి జంకుతారేం !

మూర్తి: (ప్రేక్షకులతో, భయం కప్పిపుచ్చుకుంటూ) మా జీవితంలో రుచిలేదండి ! అభిమానం ఎక్కువ! అవమానాలూ ఎక్కువే ! అందుచేత, నా కోరని కోరికలన్నీ స్వప్నాల్లోనే తీర్చుకుంటా ! (స్వప్నం కంటున్నట్టు) నా స్వప్నాలు నవ్విస్తాయి, కవ్విస్తాయి, ఏడ్పిస్తాయి. ఒక్క క్షణం తీరికవుంటే స్వప్నజగత్తులో ప్రవేసించి సర్వసౌఖ్యాలూ అనుభవించి .... (ఏదో చెప్పబోతూ సిగ్గుపడతాడు)

అన్న: (ఎగతాళిగా) మళ్ళీ నిద్రలేచి ఆఫీసుకు పోతారు !

మూర్తి: ఏం చేస్తాం ! ప్రొద్దున లేస్తే ఆఫీసులో చాకిరీ, అధికార్ల దబాయింపు; ఇంటికొస్తే ఎదురు చూస్తున్న కష్టాలు ! ఇన్ని బాధలు వేధిస్తుంటే ఇక స్వప్న జగత్తు తప్ప గత్యంతరం ఏముంది చెప్పండి !

అన్న: ఏదీ? ఒక్క స్వప్నం ?

మూర్తి: (భార్యతో) వద్దు, వద్దు! ప్రాణంమీద కొస్తుంది ! (ప్రేక్షకులతో) ఇక్కడలాగ అక్కడ హద్దులు, ఆరమరలు వుండవు; నీతి అవినీతులుండవు; కక్షలు క్షుద్రులు వుండవు, స్వేచ్ఛగా విహరించవచ్చు !— చూడండి ! మా క్షేమం కోరుతున్నందుకు కృతజ్ఞుణ్ణి ! కాని నా స్వప్నాలు తెలుసుకోవాలని మాత్రం పట్టుబట్ట కండేం!

అన్న : నవ్వుతారు !

మా : (సభయంగా భార్యతో) నన్నుచూసి నవ్వేవాళ్లెవరు ?

అన్న : మీ స్వప్నాలు చూసి ! (మెల్లగా వెనక్కు వెళ్ళిపోతుంది)

మా : (కోపంగా) నా స్వప్నాలతో ఎవరికేం పని ! నా స్థిర చరాస్తులన్నీ అవే ! మనకీ లోకంలో ఏమీ లేనప్పుడు, ఊహించుకునే హక్కైనా లేదా ?

అన్న : (పిలుస్తూ) రండి మరి ! అసలే అలిసిపోయున్నారు ! కొంచెంసేపు——

మా : (అన్నపూర్ణతో) నేను లోకాన్నిచూసి భయపడతాను గాని, మొఖంమీద అనేస్తాను !

అన్న ! హాయిగా కొంచెంసేపు విశ్రాంతి తీసుకోండీ !

మా : (వెనక్కు వెళ్ళుతూ) ఔను, కొంచెంసేపు విశ్రాంతి తీసుకో మంటావుగాని, ఒక కప్పు కాఫీ ఇస్తాననవు గదా!

అన్న : ఇప్పుడే కావాలా ?

మా : (సంతోషంగా) బాగుంది ! ఇంకెప్పుడు! భర్తను మర్యాద చెయ్యడం ఇలాగేనా ?

అన్న : అయితే ఒక్క నియమం పాటించాలి.

మా : ఏమిటో ?

అన్న : మీరారా పడక కుర్చీలో మాత్రం పడుకోకూడదు.

మా : ఊహుఁ, అదిమాత్రం వీల్లేదు ! (పడక కుర్చీలోనే పడు కుంటూ) వెళ్ళి కాఫీ పెట్టు !

అన్న : మళ్ళీ మీ స్వప్నాలతో నన్ను బాధపెడతారు.

మా : (సంతోషంగా) ఏం బాగుండదూ ?

అన్న : (సంతోషంగా) ఓ అద్భుతంగా వుంటాయి. కానీ స్వప్నాలే
గదా ! (ఆమె లాంతరు తీసుకొని లోపలికి వెళ్ళిపోతుంది.)

(నేపథ్యంలో పాట)

భయం భయం బ్రతుకు భయం !
భయం బ్రతుకు భయం భయం !
అన్నా ! మనకీ లోకం
పన్నిన పద్మవ్యూహం !

ఆశలతో బ్రతుకీడ్చే
అస్థి పంజరాలు మనం !
అప్పులతో హతమయ్యే
ఆశాజీవులం మనం !

గతమంటే కారువెగటు
శేషంటే తగనిభయం !
ప్రళయం ఈ ప్రస్తుతం
క్షణక్షణం దుర్మరణం !

ఛిద్రమైన జీవితాలు
చితికిన సంసారాలకు
స్వప్నం మన స్వర్గసీమ
సౌభాగ్యం సౌందర్యం !

భయం భయం బ్రతుకు భయం !
భయం బ్రతుకు భయం భయం !

---

# స్వాప్నిక జీవితం :

## ప్రథమాంకము

[ మద్రాసు నగరంలో ఒక హోటల్‌లో మేడమీదిగది. కిటికీలలో నుంచి సముద్రతీరం కన్పిస్తోంది. గోడలకు అద్దాలు, ప్రకృతి దృశ్య చిత్రాలు, గదినిండా రోజ్ వుడ్ కుర్చీలు, డ్రాయరు, సోఫాసెట్ మొదలైనవి.

సమయం సాయంత్రం. తెల్లని యూనిఫారంలో వున్న ఇద్దరు వైటర్లు, క్రొత్తగా కొన్న అనేక వస్తువులు, సూట్ కేసులు, ఆట వస్తువులు, సిల్కు చీరెలు, ఒక చిన్న పేటికలో విలువైన నెక్ లెస్, బాడ్ మింటన్ బ్యాటు మొదలైనవి తెచ్చి గదినిండా సర్దుతూ, హుషారుగా ఈలలువేస్తూ తిరుగుతున్నారు.

పనిఅయినతర్వాత ఇద్దరూ సంతోషంగా ఒకరినొకరు చూసుకుంటారు. గదిలోపలికి చూస్తారు. ఎవరూ రాకపోవడం గమనించి మాట్లాడుకోవడం ప్రారంభిస్తారు. ]

మొదటి వైటర్ : దర్జాఅంటే ఇలా వుండాలిరా—

రెండవ వైటర్ : ఓ ఆయన దర్జా, ఆయన డాబూ ఎవరికొస్తాయిరా !

మొ. వై : అందుకే ఈ హోటలుకొచ్చాడు. కొద్దికొద్ది వాళ్ళసలీ బిల్డింగ్ చూసే హడిలిపోతున్నార్రా !

రెం. వై : ఇంత పెద్ద హోటలు ఆలిండియాలోనే లేదని మొన్న మానేజరన్నాడురా !

మొ. వై : అతను మొదట వచ్చినప్పుడు ఆ గడ్డం, ఆ మాసిన బట్టలు చూసి ఎవరో నౌకరనుకున్నా—

రెం. వై: మరునాటికి ? మహారాజులాగ తయారుకాలా ? ఆ బట్టలకు, నేను చూశానుగా, ఐనువందలు బిల్లు అయిందిరా—

మొ. వై: మొదట మానేజరే అనుమానపడ్డాడు. తర్వాత ఆ ఠీవి, ఆ మాటలు చూసి గజగజ వణికిపోయాడు. మహారాజు! అడక్కుండానే నాకు రూపాయిచ్చాడురా!

[ జేబులోనుంచి తీసి చూసుకుంటాడు ]

రెం. వై: ఇదిగో! నాకు రెండు రూపాయలిచ్చాడు.

మొ. వై: అనుకుంటున్నావేం! ఇవిగో! మూడు రూపాయలు!

[ చూపిస్తాడు. ]

రెం. వై: ఓస్, ఇంతేనా! చెప్పొద్దనుకున్నాను గాని ఇవిగో! (జేబులోనుంచి తీసి సంతోషంగా) మొత్తం ఐను రూపాయలు!

మొ. వై: (ఆశ్చర్యంతో) ఆఁ! నీకుకూడా ఇచ్చాడూ! నాకే అనుకున్నానే! (జేబులోనుంచి మరి రెండు ఐదు రూపాయలు తీసి చూపిస్తాడు.)

రెం. వై: మెల్లగా అంటావేంరా! ధర్మరాజైతే! (దగ్గరగావచ్చి) నీతో చెప్పాడా? [రహస్యంగా] ఇక్కడెవరితోనూ తన వూసే ఎత్తవద్దన్నాడు.

మొ. వై: [ఆలోచిస్తూ] ఆఁ, అరే! ఏమిటో రహస్యం!

రెం. వై: అదే నా కంటుపట్టడంలా!

[ ఆంజనేయులు వచ్చి నిశ్శబ్దంగా వాకిట్లో నిలబడతాడు. ]

మొ. వై: ఒరేయ్, సజమేగాని, ఆయన వైఖరిచూస్తే బాగా కష్టాలు పడ్డవాడిలా కన్పిస్తున్నాడురా!

రెం. వై: అసలేదో రహస్యం వుందిరా! వచ్చిన రోజునే మానే జరును పక్కకుపిలిచి ఏవేనో గుసగుసలాడాడు. ఏ పుట్టలో ఏ పాముందో మనకేం తెలుసు!

మొ. వై: మనకెందుకు లేరా! మామూలిచ్చి నోరు కట్టేసిన తర్వాత గప్‌చిప్‌గా వూరుకోవాలిగాని—

రెం. వై: [ఆంజనేయుల్ని చూసి నాలుక కొరుక్కుని] ఆగు ఆగు! ఎవరో వచ్చారు. [ఆంజనేయులుతో] ఎవరు కావాలండీ?

అంజ: ఈ గదిలోకి కొత్తగా ఎవరైనా?

మొ. వై: మీ కెవరు కావాలో చెప్పండి!

రెం. వై: ఇక్కడెవరూ లేరు.

ఆంజ: ఈ గదిలో వున్నాడని చెప్పారయ్యా—

మొ. వై: ఆయన పేరు?

ఆంజ: మాణిక్యాలరావు.

రెం. వై: [నిర్లక్ష్యంగా] ఇక్కడలేరు పోండి!

ఆంజ: లేరంటావేమయ్యా! ఈ గదిలో వారం రోజులనాడు ఒక చామనఛాయ బక్కపలచని మనిషీ, అతని భార్యా, కొడుకూ వచ్చి దిగలా?

మొ. వై: [ధీమాగా] లక్షమంది వస్తూ వుంటారు. పోతూ వుంటారు. వెళ్ళి మానేజరు నడగండి.

ఆంజ: అడిగే వచ్చాను. మేడమీద పదమూడో నంబరు గది ఇదేగా? ఇదిగో చూడు! అతనెలా గుంటాడో కొంచెం చెప్పండి!

రెం. వై. [కోపంగా] మీలాగేం వుండరు, తెలిసిందా?

మొ. వై: [నిర్లక్ష్యంగా] ఇక తమరు దయచెయ్యవచ్చు!

ఆంజ : [నవ్వుతూ] ఆయన పేరేమిటో చెప్పండి; మిమ్మల్ని సంతోష పెడతాలే____

రెం. వై: నువ్వా ! మమ్మల్నా ! చాల్లే!

ఆంజ : [జేబులో చెయ్యిపెట్టి] పదిరూపాయలం తీసుకోండయ్యా, పండుగొస్తోంది ! [ఆదుర్దా కనబరుస్తూ] ఆయనతో చాలా అర్జంటు పనుంది !

మొ. వై: [మెత్తబడి] ఆయనతోనా ! మీకేం పని ? అసలు మీతో మాట్లాడతాడో లేదో ?

ఆంజ : అదంతా నేను చూసుకుంటాను. ఎక్కడి కెళ్లాడు !

[వైట్లిద్దరు ఒకరి నొకరు చూసుకొని, ఇంకా డబ్బివ్వలేదని నిర్లక్ష్యంగా, ఎగతాళిగా నవ్వుతారు.]

రెం. వై: చాల్లే పదండి ! ఆయన గొప్ప కోటీశ్వరుడు. మీ మొఖం చూస్తాడా !

ఆంజ : [పది రూపాయల నోటు తీసి చూపించి ఊరిస్తూ] అతని రహస్యం నాకు తెలుసు. చెప్పండి! [నోటు మొదటి వైటరు కివ్వబోయినట్లు చూపిస్తాడు.]

మొ. వై: (ఆశతో) అలా చెప్పరేం ! ఆయ నెక్కడికీ వెళ్ళలేదు. ఇప్పుడే స్నానంచేసి టాయిలెట్ రూమ్‌లోకి వచ్చాడు.

ఆంజ : ఎక్కడెక్కడ తిరుగుతున్నాడు ? ఏం చేస్తున్నాడు ?

రెం. వై: (మొ. వై. కంటే ఎక్కువ ఆశతో) ఇప్పటికి వచ్చి వారం దాటింది. కాని, ఒక్కరోజుకూడా బైటికిపోలేదు. ఆయన పనులన్నీ మా మానేజరే చూస్తున్నాడు.

ఆంజ : (ఆప్యాయత నటిస్తూ) సంతోషంగా వున్నాడుగదా? భార్యా బిడ్డా అంతా ఇక్కడే వున్నారా? సంతోషంగా వున్నాడా?

మొ. వై: మొదట కొంచెం దిగులుగా కనపడ్డాడు గాని—

రెం. వై: నిన్నటినుంచి ఆయన ఆనందం ఏమని చెప్పాలి!

మొ. వై: (డబ్బుకోసం చెయ్యిసాచి) ఆయన పేరు రత్నరాజు—

రెం. వై: (డబ్బు మొ. వై. కు ఇస్తాడేమో అనే ఆదుర్దాతో, త్వరగా) భార్యపేరు అన్నపూర్ణగారు! (చెయ్యి సాచుతాడు.)

ఆంజ : (సంతోషంతో) ఓహో! అలా చెప్పండి! డబ్బు దగ్గరగా ఖర్చుపెడుతున్నాడేం?

మొ. వై: ఊరికే అంటారేం. ఈ వస్తువులకు, హోటలుకు అప్పుడే రెండు మూడు వేలయింది! మహారాజు, డబ్బు నీళ్ళలాగ ఖర్చుపెట్టేస్తారు! (డబ్బుకోసం) ఇప్పించరూ?

రెం. వై: (త్వరపడుతూ) నా కిప్పించండి! నేనుగదూ పూర్తిగా చెప్పింది?

ఆంజ : (నోటు జేబులో పెట్టేసుకుని) ముందే ఎందుకు చెప్పలా?

మొ. వై: ఒక్క ముక్కగూడ బైటికి పొక్కగూడ దన్నారు. మామూలివ్వరూ?

రెం. వై: మీకు వచ్చారని చెప్పమంటారా? పిలుచుకొస్తా! ఏదీ? (చెయ్యి సాచుతాడు)

మొ. వై: మీ పేరేమిటి? నేనే వారితో చెప్పి పిలుచుకొస్తా!

ఆంజ : (ఆదుర్దాగా) వద్దు! వద్దు! వాడొక వట్టి దొంగ!

(వెళ్ళిపోతూ) మామూలు మళ్ళీవచ్చి ఇస్తాన్లే! (వెళ్ళి పోతాడు.)

[వైటర్లిద్దరూ ఒకరి నొకరు కోపంగా చూసుకుంటారు. ఆశ్చర్యపడతారు.]

మొ. వై: (ఆందోళనగా) పోతున్నాడురా!

రెం. వై: నేను వెంటబడి వెళ్ళనా!

మొ. వై: (పోటీగా) నేను వెళ్ళొస్తానుండు!

రెం. వై: (మొ. వై. ను గట్టిగా చెయ్యిపట్టుకుని ఆపి) నేనైతే నిల బెట్టి పోట్లాడతా—

మొ. వై: (రెం. వై. ని ఆపుతూ) నేనైతే రెండు వుతికి డబ్బు తెస్తా—

రెం. వై: (ఒకరినొకరు ఆపుకుంటూ) నువ్వుండు!

మొ. వై: నువ్వే వుండరా అంటే—

మొ. వై: } (ఇద్దరు వైటర్లు ఒకరినొకరు ఆపుకోవడంవల్ల అసలు
రెం. వై: } అవకాశమే వుండదేమోనని భయపడి)
ఇద్దరం పోదాం పద!

[ఇద్దరూ పరుగెత్తి దైటికి వెళ్ళిపోతున్నప్పుడు, లోపలి నుంచి కొత్తబట్టలు వేసుకున్న కృష్ణ ప్రవేశిస్తాడు.]

కృష్ణ: (గదిలో వస్తువులన్నీ చూసి సంతోషంతో ఉప్పొంగి పోతూ) అమ్మా! తెచ్చారే! రండమ్మా! రా నాన్నా!

[అని పెద్దగా పిలుస్తాడు. అక్కడేవున్న సైకిలు తీసుకుని వెళ్ళిపోతాడు. వెంటనే అన్నపూర్ణ ప్రవేశిస్తుంది. ఆమె సిల్కుబట్టలు వేసుకుని దర్జాగా ముస్తాబై వుంటుంది.]

అన్న: (సంతోషంతో) ఏవీ! వస్తువులన్నీ తెచ్చారే! (బట్టలు,

పౌడరు టిన్నులు, ఆటవస్తువులు చూస్తూ చలాకీగా
నడుస్తూ) రండి రండి! మనమేం కోరుకున్నామో అన్నీ
వచ్చేశాయి. అబ్బా రండీ! ఎంత సేపక్కడ!

[ మాణిక్యాలరావు చక్కని సిల్కుసూటు వేసు
కుని సంతోషంగా ఠీవిగా లోపలికి వస్తాడు. ]

మా : ఎన్నడూ బట్టలమొఖం ఎరగని వాళ్ళలాగ అంత ఆశ్చర్య
పడతావేం? కృష్ణ ఏడీ? ఎక్కడికి వెళ్ళాడు?

అన్న : సైకిలు తీసుకుని బైటికి వెళ్లాడు.

మా : ఆ సైకిలు కిందపెడితే అనవసరంగా బజారులో తిరుగుతా
డనే మేడమీదికి తెప్పించాను. ఎప్పుడో ప్రాణంమీదికి
వస్తుంది!

అన్న : ఇప్పుడే వస్తాడులెండి! వచ్చిన తర్వాత కోప్పడండి!

మా : కొన్నాళ్ళవరకూ బైటివాళ్ళకు మనలో ఎవరు కనపడినా
చాలా ప్రమాదం సుమా!

అన్న : మీరు చెపితే భయంగా వుంటాములెండి! (నెక్లెస్
బైటికి తీసి ఉప్పొంగిపోతూ) ఎంత బాగుందో!

మా : ఏమిటా వెర్రి! ఎప్పుడూ నెక్లెస్ చూడలా?

అన్న : చూడటం ఒకవంతు, సంపాదించటం ఒక వంతు! ఈ
వస్తువులన్నీ మనవేగదూ! నాకెంతో ఆనందంగా వుందండీ!

మా : (నవ్వుతూ) చాల్లే ఊరుకో! డబ్బు వచ్చిపడినప్పుడు
దానికి తగినట్లు హుందాగా ప్రవర్తించాలిగాని, ఇన్నాళ్లూ
వీటికోసం తపించిపోయినట్టు...

అన్న : మీరుమాత్రం? మంచి సిల్కుసూటు వేసుకుని సరదాగా

కాలెక్కి అలా షికారుగా వెళ్ళాలని ఎన్ని సార్లన్నావు నాతో?

మా : కొన్నానుగా! కొని కోటీశ్వరుడిలా నిర్లక్ష్యంగా వున్నా! అదీ పద్ధతి! (నెక్లెస్ భార్యమెడకు అలంకరిస్తూ) అన్నపూర్ణా! యు ఆర్ బ్యూటిఫుల్! యు ఆర్ గ్రాండ్! ఐ కంగ్రాచ్యులేట్ యూ!

అన్న : (పరవశమౌతూ) ఏం! పూర్వం ఎలా వున్నానో ఇప్పుడూ అలాగే వున్నా!

మా : అన్నపూర్ణా! నా హృదయం పొంగిపోతోంది! ఏదో పైములోనుంచి; దారిద్ర్యపు పైములోనుంచి ఈ స్వర్గలోకంలోకి ప్రవేశించిన మొదటివారం ఇది! కానీ, నువ్వొకటి మాత్రం నేర్చుకోవాలి! డబ్బునూ, సౌఖ్యానికీ లెక్కచెయ్యనట్లు కనిపించాలి, పైకి! లోపల మాత్రం క్షణక్షణం వాటికోసమే ఆలోచించాలి! లేకపోతే ఒక్క కానీ కూడా సంపాదించలేం!

అన్న : మీరు చెప్పేదంతా ఏదో విపరీతంగా వుంది!

మా : ఇదొక కొత్తలోకం! ఇందులో [illegible] లేపిస్తే అక్రమాలవి కావు, ఘనకార్యాలని!

అన్న : ఏమిటో! మీ ధోరణి మీరూ అంతా విచిత్రంగా వుంది! మీ మాటలు ఆనందంగా వున్నాయి, కాని మీ ముఖంచూస్తే ఏదో ఆందోళనతో కుంగిపోతున్నట్టని పిస్తోంది!

మా : (కప్పిపుచ్చుకుంటూ) అవునూ; నిజమే. ఆఁ, ఇంకెంత కాలంలే! రేపు రైలెక్కితే ఆదుర్దామే అక్కర్లేదు!

మీ కుటుంబం మా కుటుంబం అనేక శతాబ్దాలనుంచి సిరిసంపదలతో తులతూగుతున్నట్లు ప్రవర్తిస్తాం! బొంబాయిలో నీవంతా మారిపోవాలి సుమా; నేను గొప్పవాణ్ణయి ఏ సభకైనా అధ్యక్షత వహిస్తే నీవు ప్రైజులు పంచిపెట్టవలసి వస్తుంది!

అన్న : (ఆశ్చర్యానందాలు వెల్లడిస్తూ, మళ్ళీ ఏదో సందేహం వచ్చి) అన్నీ చెప్పుతారు, కాని ఆ రహస్యం మాత్రం బైటికి రానివ్వరు గదూ?

మా : ఏమిటది? నీకు చెప్పకుండా ఏం దాచిపెట్టాను?

అన్న : మరెందుకు చెప్పరు? ఆరోజు రాత్రి బ్యాంకులో లెక్కలు వ్రాయడాని కుండమంటే తెల్లవారు ఝామువరకూ వేగ వ్రాసి, జట్కా మీద ఇంటికివచ్చి హఠాత్తుగా బయలు దేరమంటిరి! నిజం చెప్పండి, మీ చేతుల్లో డబ్బు సంచులు చూడబట్టిగానీ, లేకపోతే నాతో చెప్పే వారేనా?

మా : (గ్రహించి) ఓ, అదా! అలా చెప్పకూడదు అన్నపూర్ణా! దాని రూలంతే!

అన్న : (కొంచెం కోపంగా) బ్యాంకు డబ్బు దొంగిలించడానికి రూలు లేదుగాని, నే నడిగితే మాత్రం......

మా : (హఠాత్తుగా కోపంవచ్చి) ఏమిటీ అంతవర కొచ్చిందీ? దొంగతనమా? ఆ మాట మళ్ళీఅను చెపుతాను!

అన్న : (అనునయంగా, లాలించినట్లు) చెప్పరూ? కోపమెందుకు? ఎంత తెచ్చారూ అని? అదేగా నే నడుగుతున్నది? నా కివ్వమన్నానా!

మూ : (కోపం తగ్గి) ఇదంతా నీకుగాకపోతే ఎవరికి? ఇన్నాళ్ళా కటిక దారిద్ర్యం అనుభవించి, బాకీలతో చాకిరీలతో యమయాతన పడబట్టి అలా చేశాను గాని...

అన్న : (ఓదార్చుతూ) నిజమే లెండి—

మూ : బ్రతికి బాగుపడాలంటే ఇక ఈ జీవితంలో మరోమార్గమే లేదని తేల్చుకోబట్టిగాని, లేకపోతే చూస్తూ చూస్తూ అలా చేస్తానా! (కోపంగా, శత్రువుల నెదిరించినట్లు) ఇది దొంగతన మెలా అవుతుంది? లోకం కాకైపోస్తే మాత్రం మనం వూరుకుంటామా? బ్రతకక్కర్లా! ఎంత చిన్న గుమాస్తానైనా నేనూ మనిషినే!

అన్న : అయితే అసలు సంగతి చెప్పరుగదూ? ఊఁ?

మూ : (సందేహిస్తూ) చెప్తాన్లే, అన్నపూర్ణా!

అన్న : (రహస్యంగా) ఎంతమంది కలిసి చేశారు?

మూ : నే నొక్కణ్ణే! స్వయంగా!

అన్న : (ఆందోళనతో) మీ తోటి గుమాస్తాలుగాని, అధికారులుగాని ఎవరూ లేరా?

మూ : ఉంటే ఎలా వీలౌతుంది? ఉన్న పనంతా గుమాస్తాల కప్పజెప్పి మానేజరు వెళ్ళాడు! మిగిలిన ఇద్దరూ సీనియర్సు కావడంవల్ల ఆ చాకిరంతా నామీదికి తోసేసి జారుకున్నారు! ఇద్దరు జవాన్లను రెండు రూపాయలు దండుగపెట్టి సినిమాకు పంపాను.

అన్న : (భయంతో) అమ్మో, గూర్ఖా లేడూ!

మూ : గూర్ఖా ఏంచేస్తాడు? కొత్తవాళ్ళొస్తే పొడిచేస్తాడు, పాత వాళ్ళకు సలాంచేస్తాడు!

అన్న : భయం పుట్టలేదండీ ?

మా : (ఆనాటి భయాందోళనలు వెలిబుచ్చుతూ) వొళ్ళంతా చెమటపట్టింది. కాళ్ళు వొణికినై. గుండెలో ప్రతి క్షణం పిడుగులు పడినట్లయింది. ఛీ ఛీ! పరువుకోసం ప్రాకులాడే వాళ్ళంత అసమర్థులు ప్రపంచంలో లేరనుకో !

అన్న : (అతిరహస్యంగా) మొత్తం ఎంత ?

మా : (ఆలోచించి) ఆఁ, ఎంత ఎనభైవేలేగా !

అన్న : నిజంగా అంతడబ్బే! అదంతా మనదేగదూ! (భయంతో) ఇక్కడికి వస్తారేమో ?

మా : (నిర్భయంగా) నా పేరు రత్నరాజు అని మార్చేశాను తెలుసా ?

అన్న : డబ్బెక్కడ పెట్టారు ? ఎక్కడ ?

మా : ఆఁ, ఎక్కడైతే నీ కెందుకు ? ఆడవాళ్ళ నోటిలో మాట దాగదు !

[కృష్ణ సైకిలుతో హడావుడిగా వస్తాడు.]

అన్న : నాన్నగారు కోప్పడుతున్నార్రా !

మా : కృష్ణా ! సైకిలు అక్కడ పెట్టెయ్! హోటల్‌లోంచి ఒక్క అడుగు బైటపెట్టకూడదు తెలుసా ?

కృష్ణ : అలాగే నాన్నా !

మా : ఎన్నిసార్లు చెప్పాలి ? (కృష్ణతల నిముర్తూ) కిందగదిలో వాళ్ళ పిల్లలున్నారు చూడు ! అక్కడికి వెళ్ళి ఆడుకో ! (అన్నపూర్ణతో)అలాంటివాళ్ళతో స్నేహంచేస్తే మానర్సు నేర్చుకుంటాడు ! వాళ్ళు కోటీశ్వరుల బిడ్డలు !

కృష్ణ : వెళతాను నాన్నా ! (వెళ్ళిపోతాడు)

అన్న : (నవ్వుతూ) అయితే నాకుగూడా నేర్పండి పూనర్సు!

మా : (సీరియస్‌గా) ఎగతాళికాదు, వాణ్ణి గట్టిగా చదివించి సెకండ్ ఫారం ప్యాసుచేయించే బాధ్యత నీది! ఇకనుంచి కుటుంబ వ్యవహారమంతా నీవే చూసుకోవాలి! ఇంట్లో ఎంతడబ్బు అవసరమైతే అంతా ముందే ఇచ్చేస్తాను. ఇక నుండి 'డబ్బులేదు' అనేమాట నాకు వినపడటానికి వీల్లేదు! ఒక కారు, ఇద్దరు సర్వెంట్సు, మన బాబుకోసం ఒక నర్సు — అన్నీ ఏర్పాటుచేసి దర్జా నిలబెట్టేబాధ్యత నాది!

అన్న : బాబుకోసం ఇచ్చిన టెలిగ్రాం చేరిందో లేదో?

మా : రాత్రికి వాళ్ళు రావడం, మనం తెల్లవారుఝామున బయలుదేరడం — అన్నీ ప్లానుప్రకారం జరగాలి. తెలిసిందా?

అన్న : మీ రెలా చెప్తే అలా చేస్తాను—

మా : (వెంటనే, సీరియస్‌గా) అదే నే నంటున్నది. ఇదంతా నీ కోసం, మన బిడ్డలకోసం చేశానని జ్ఞాపకముంచుకో! మీ సుఖంకోసం ఎంత దారుణంగా నయినా ప్రవర్తిస్తాను. ఎంత అపనిందయినా భరిస్తాను—కానీ, మీరు నన్ను గౌర వించకపోతే మాత్రం సహించలేను!

అన్న : (సమాధాన పరుస్తూ) మిమ్మల్ని ఎప్పుడో అగౌరవంగా చూసినట్టు! ఏం మాటలండీ!

మా : (దిగులుమరచి, నవ్వుతూ, డ్రాయర్ మీది మోటారు బొమ్మ చేతపుచ్చుకొని) పోనీ ఆడుకుందామా! ఇలారా!

అన్న : (నవ్వుతూ) మరీ పసిపిల్లలౌతున్నారేం, చిన్నప్పుడాడుకో లేదా యేం?

మా : మనమేం రాజకుటుంబాల్లో పుట్టామా, ఆడుతూ పాడుతూ హాయిగా పెరగడానికి? నిజంగా అన్నపూర్ణా! నేను పుట్టినప్పట్నుంచి ఒక్క బొమ్మయినా ముట్టుకోలా — ఇంట్లో మట్టిబొమ్మలన్నీ చెల్లెళ్ళకే సరిపోయినై!

అన్న : ముందు చాలా యేళ్ళున్నాయిలెండి—

మా : (సీరియస్‌గా) తర్వాత నాకు తీరికేం వుంటుంది? బిజినెస్ ప్రారంభిస్తే ఊపిరి సలుపుతుందా? నేను మానేజింగ్ డైరెక్టరునైతే గుమాస్తాలు, సెక్రెటరీలు, పార్ట్నర్లు, మీటింగులు, ఉపన్యాసాలు, పత్రికల్లో ప్రకటనలు— ఓ! ఒకటేమిటి!—

అన్న : మీ ఊహలన్నీ అద్భుతంగా వున్నై. కానీ....నాకేదో భయంగా వుందండీ...వాళ్ళు వస్తారేమో అని.

మా : (ఒక్క క్షణం యోచించి, ఉలిక్కిపడి) నాకుకూడా; వస్తే రానీ, తప్పదు! ఈ లోకానికి కావలసింది మంచితనం కాదు అన్నపూర్ణా, మన ధనం! (గట్టిగా తనకు తాను సంబోధించుకుంటూ) ఇప్పుడు ఈ ప్రపంచానికి డబ్బే డిక్టేటర్ అంటాను!

(హఠాత్తుగా డోర్ బెల్ మోగుతుంది. ఆగి, మళ్ళీ అదే పనిగా మోగుతుంది. ఆందోళనతో) ఎవరో వచ్చారు, చూడు! (ఆమె వెళ్ళబోతుంటే వెనక్కు పిలిచి) హోటల్ మానేజర్ వచ్చాడేమో, ఠీవిగా మాట్లాడు! మెత్తగా మాట్లాడితే ఆరాతీయడం మొదలెడతాడు!

అన్న : చూసివస్తా! (బయటికి వెళ్ళి, వెంటనే వచ్చి, భయ

పడుతూ) అతనండీ! ఆ ఆంజనేయులు! మీ హెడ్ గుమస్తా!

మా : (ఆదుర్దాగా) అతనా! అతనేనా? బాగా చూశావా? నిన్ను గుర్తుపట్టాడా యేం? పో! తలుపు గడియవెయ్! బిగించేసెయ్, పో!

[ఆమె వెళ్ళబోతుంటే ఆంజనేయులు లోపలికి వస్తాడు. వయస్సు 50 సంగులు. పాసుగైన పాతకోటు, దారం కట్టిన కళ్ళద్దాలు, చేతిలో గొడుగుతో ఊలుతూ నడుస్తాడు.]

ఆంజ : (వస్తూనే, దొరికాడుగదా అనే సంతోషంతో) ఏమోయ్ మాణిక్యాలరావ్! నీ కోసం వెతకలేక ఛాతమారి పోతున్నా! (చుట్టూ విలువైన వస్తువులు చూసి) ఎంత మారిపోయావోయ్! (మూర్ఛపోతాడు).

మా : (కోపం, నిర్లక్ష్యం నటిస్తూ) ఎందుకొచ్చావు? ఏదైనా ఉద్యోగరీత్యా—

ఆంజ : (అన్నపూర్ణతో) ఏమిటమ్మాయ్, మొఖ మెరుగని వాళ్ళతో మాట్లాడినట్టు — (మాణిక్యంతో) అప్పుడే మరచిపోయావా? ఒక వారమేగా అయింది!

మా : ఇంకా హెడ్ క్లర్కులాగ దబాయించకండి! మీరు వచ్చిన పనేమిటి?

ంజ : (ఆశ్చర్యపడి నిదానించి) మీ నాన్నా నేనూ స్నేహితులం గాబట్టీ, ఇంతప్పట్నుంచీ నిన్నెత్తుకుని తిరగబట్టీ గానీ, లేకపోతే 'నేనుకాదు పోవయ్యా' అనేవాడివే! (వెటకారంగా) పెద్దపనులు తలపెట్టినా ఇంకా చిన్నతనం వదల్లేదు. (ఆమెతో) అమ్మాయ్! కొంచెం మంచినీళ్ళం

దుకో ! (ఆమె లోపలికి వెళ్ళుతుంటే ఇద్దరినీ పరీక్షగా చూస్తూ) వెలిగిపోతున్నారు !

మా : (ఎలా మాట్లాడాలో తోచక) ఎప్పుడొచ్చారు? ఏమిటి సంగతులు ?

ఆంజ : అంతా క్షేమమే; నీ పుణ్యమా అని...నిన్నంతా పోలీసు విచారణ జరిగి, బ్రతికి బైట పడేటప్పటికి మా తాడు తెగింది.

మా : (ఆదుర్దాగా) ఏమైంది ? ఏం తేల్చారు ?

ఆంజ : ఏమవాతుంది ! చూస్తున్నావుగా; బయలుదేరి వెతకడాని కొచ్చాం ! లక్షా యాభైవేలు పోతే అప్పుడే యేమవా తుంది !

మా : (ఆశ్చర్యం నటిస్తూ) ఎప్పుడు ?

ఆంజ : నేనేం మనిషి ననుకున్నావా, మాను ననుకున్నావా ? ఎవరిని మోసం చెయ్యాలని ! పిల్లి కళ్ళుమూసుకుని—

అన్న : (ప్రవేశించి మంచినీళ్ళిచ్చి) అంతా క్షేమంగా వున్నారా!

ఆంజ : ఆఁ మా క్షేమ మాలోచిస్తే ఇలా లోకులసొమ్ము—

మా : (ఆగ్రహంతో) కట్టిపెట్టండి ! మీ సంగతి నాకు తెలుసు ! ఎప్పుడో ఎవరో దొంగతనంచేస్తే అది నా మీదికి నెట్టా లని ప్రయత్నం చేస్తున్నారేం ! పెద్దమనిషివిగదా వచ్చా వనుకున్నా—

ఆంజ : (కోపంతో) నీ అహం తగ్గదోయ్ ! మిడిమేళంగా వచ్చిన డబ్బు ఇంత అహం తెచ్చిపెడుతుందేం ?

మా : (విసురుగా) నన్నేం చేస్తారయ్యా! మీరంతా కలిసి తలా కొంచెం మింగికూచున్నారు గాబోలు! పో, పో ! పోయి

ఎక్కడ పెట్టారో ! త్వర్వా తెచ్చి కేసు షూవుచేసుకోండి !

అన్న : (మనవిగా) మాకేం తెలుస్తుందన్నయ్యా; ఓర్వలేనివా ళ్ళెవరో మామీద చెప్పివుంటారు !

మా : (గట్టిగా) అన్నపూర్ణా ! నీకు తెలియదు, లోపలికి వెళ్లు! ప్రయాణానికి సిద్ధం కానక్కర్లా ! వెళ్ళనేం ! ఈ గొడవ లన్నీ పెట్టుకుని మన పనులు మరిచిపోతే యెట్లా ! (ఆమె లోపలికి వెళుతుంది.)

ఆంజ : నీ వుద్దేశ మేమిటోయ్ ! నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా ? మన వూరంతా గగ్గోలుగా వుంది ! నీ కోసం ఇప్పుడు దేశమంతా గాలిస్తున్నారు. నీవంటి వాణ్ణి పట్టుకోవడం అసంభవం కాదు. నేను వచ్చిందే అందుకు !

[ జేబులోనుంచి ఒక కాగితం తీసి మాణిక్యాల రావుకు చూపిస్తాడు. అతను దాన్ని చదువుతూ ]

మా : (ఆశ్చర్యంగా ఆగ్రహంతో) అయితే పోలీసులతో కలిసి సాటివాళ్ళమీద కత్తిగడతారా ? ఇదేనా మీ న్యాయం!

[ కాగితం ఆంజ నేయులు చేతిలోనుంచి లాక్కోబోతాడు. ]

ఆంజ : (గభాలున కాగితం జేబులో పెట్టుకుని) నిగ్రహించుకో ! ముందున్నది ముసళ్ళ పండుగ !

మా : (ద్వేషంతో) తెలిసిందిలే; నీచానికి పూనుకొని——

ఆంజ : (కోపంతో నిలబడి) జాగ్రతగా మాట్లాడు ! ఈ వుత్తరం ఏ పోలీసుస్టేషన్‌లో చూపించినా యాభైమంది పోలీసు లొస్తారు. తెలుసా, యాభైమంది ! ఏం, నాకు వచ్చే బహుమానం పోగొట్టుకో మంటావా ?

మా : (నిశ్చేష్టుడై, ఇక గత్యంతరం లేక ఎంతో మృదువుగా) మెల్లగా మాట్లాడు ఆంజనేయులూ! రా, కూర్చో!

ఆంజ : (బెట్టుగా) నేనేం కూర్చోడానికి కులాసా లడగడానికి రాలేదు!

మా : ఫర్వాలేదు కూర్చో! నీవు నా తండ్రి సాటివాడివి! నిన్ననవసరంగా కష్టాల్లో పెడతానా? (పెద్దగా) అన్నపూర్ణా! రెండుకప్పులు కాఫీ కావాలి! (ఎంతో మర్యాదగా) ఆంజనేయులూ, చూడు! నే నిక్కడున్నానని నీ కెట్లా తెలిసింది?

ఆంజ : (డాబుగా) ఇక్కడ బ్యాంకులన్నీ ఒక గంటలో ఎంక్వైర్ చేశాను! నీ దొంగపేర్లన్నీ బైటపడ్డాయి! అక్కడ రైల్వే స్టేషన్‌లో మొదలుపెట్టి ఇక్కడ పోస్టాఫీసులు, బ్యాంకులు, షాపులు అన్నీ ఇట్టే గిర్రున తిరిగొచ్చేశాను!

మా : (పొగుడుతూ) ఎలాగైనా సమర్థుడివిలే! చూడు! (ఆప్యాయంగా, మెల్లగా) ఇంత పెద్దవాడివిగదా! నీ కైదుగురు బిడ్డలుగదా! నీకు రేపు ఏదైనా జబ్బు చేస్తుందనుకో, లేకపోతే ఏదో ప్రమాదం జరిగి...తర్వాత నీ కుటుంబానికి కష్టమౌతుందనుకో! అప్పుడు మీ వాళ్ళ గతేమిటి?

ఆంజ : (విసుగుగా) ఇప్పుడీ చరిత్రలన్నీ ఎందుకోయ్! నన్ను గూడా ఈ ఊబిలోకి లాగాలనా? నాకు ముప్పైఏళ్ళ సర్వీసుంది! నే నిలాంటి బోగస్ పనులు పెట్టుకుంటె—

మా : నామాట కొంచెం విను ! (సూటిగా) ఒక్క ప్రశ్నకు జవాబు చెప్పు !

ఆంజ : ఏమిటది ?

మా : నీ జీవితంలో ఎన్నడైనా సుఖపడ్డావా ? ఇదిగో, నేను సుఖంగా వున్నానని గుండెమీద చెయ్యివేసుకుని నిద్ర పోయావా ?

ఆంజ : (ఆలోచించుకుని సిగ్గుపడుతూ) లేదు, ఎన్నడూ సుఖమనేది ఎరగను, కాని—

మా : మరి పూర్తిగా విను ! నీ దారిద్ర్యంవల్ల చదువుకోలేక నీ బిడ్డలు పరాయిపంచలు పట్టలా ?

ఆంజ : (ఆమోదిస్తూ) అవును ! ఇంట్లో బండెడు పిల్లలతో యమయాతన పడుతున్నా, కాని—

మా : అదే నేనంటున్నది ! మా బాబుని అత్తగారింట్లో పెంపకాని కిచ్చాను, గతిలేక ! నాకు పెద్దకొడుకును చూస్తే భయం, ఏం కొనిపెట్టమంటాడో అని ! బజారులో అమ్మే బొమ్మలన్నీ కొనుక్కునేహక్కు లేదూ వాళ్ళకు? ఉంది! కాని, డబ్బేది ? నీవుమాత్రం ? కట్నమివ్వలేక నీ పెద్ద కూతుర్ని చూస్తూ చూస్తూ ఒక ముసలివాడి కంట గట్టావుగదా ! నీ నా దారిద్ర్యంవల్ల పసిపిల్లలు బాధ పడటం ఏం న్యాయం చెప్పు ?

ఆంజ : నిజమే ! అందుకని దొంగతనం చెయ్యమంటావా ?

మా : ఏదో విధంగా డబ్బు సంపాదించమంటా ! నీ చెప్పుడూ తప్పుచెయ్యాలా ? చెప్పు ! నీ తమ్ముళ్ళను దగాచేసి ఆస్తి అంతా వేసుకోలా ?

ఆంజ : (తడబడుతూ) అడలాపుంచు ! ఇప్పుడీ డబ్బంతా నీకే వచ్చిందిగాని, నాకేం వొరిగిందోయ్ ! నీ సౌఖ్యం కోసం నా ఉద్యోగం ఊడగొట్టుకోమంటావా యేం ?

మా : నేనే కబురు పంపుదామనుకుంటున్నా ! పట్నంచివర చక్కని మేడలు రెండు బేరం చేశాను. రెండూ నలభై వేల కొస్తాయి, అవి మనిద్దరికీ !

ఆంజ : (ఆశ్చర్యంగా) ఆఁ ! ఏమిటీ ! నాతో వేళాకోళమా ?

మా : కాదు, కాదు యథార్థం ! మీ అబ్బాయి పేర, నీ యిష్టం వచ్చినంత, నాలుగు వేలు బ్యాంకులో వేస్తాను. అతని చదువుకు, మీ అమ్మాయిల పెళ్ళిళ్ళకు మొత్తం పోనీ పదివేలు సరిపోతాయా ?

ఆంజ : (ఉప్పొంగిపోతూ) పదివే లెందుకు ! రెండు వేలుంటే ఆంజనేయస్వామికి ఆకుపూజ చేయించి—

మా : అవన్నీ తర్వాతలే – నామాట విను ! జీవితానికి ఒక్కసారే ఈ అవకాశం ! చూస్తూ చూస్తూ ఎవరైనా ఒక్క దమ్మిడీ యిస్తారా ? నే నిస్తున్నా ! ఎవరు చేస్తే నేం, ఇద్దరం అనుభవిద్దాం ! సరేనా ?

ఆంజ : అసలే పెండ్లీడుకు వచ్చిన పిల్లలతో దిక్కుతోచక ఉక్కిరి బిక్కిరై పోతున్నా...(విచారంగా) రెండేండ్లలో రిటైర్ కావాలంటున్నారు!

మా : (నచ్చజెప్పాలని) నీ కుటుంబాన్నంతా ఇక్కడికే పంపించు! నలుగురూ అనుభవిస్తే నాకేం నష్టం ! నే నొక్కణ్ణే కట్టుకుపోవాలనే దురాశ నాకులేదు. నిన్నుగూడా నా కంపెనీలో డైరెక్టరు చేస్తా !

ఆంజ : (ఆశ్చర్యంతో) నన్నా! డైరెక్టరా? డబ్బేది?

మా : నేనే నీ పేరగూడ షేర్లువేస్తా! (నిలబడతాడు)

ఆంజ : (భయంతో దగ్గరకు వచ్చి) పట్టుకుంటే నిన్ను ఇప్పుడు?

మా : ఆ వొక్కటీ తప్పించేభారం నీది! ఫస్టుక్లాసు టిక్కెట్టు తెప్పిస్తా...రాత్రికే...హాయిగా పడుకొని ప్రయాణం చెయ్యొచ్చు! ఇక్కడ ఏర్పాట్లన్నీ నేను చేస్తా; అక్కడ నువ్వు రాజీనామా యిచ్చి—

ఆంజ : (పరవశమౌతూ) నిజంగా? డైరెక్టరు చేస్తావా? నా సర్వీసు ముప్ఫైఏళ్ళు! మన వ్యాపారమంతా బ్రహ్మాండంగా నడుస్తున్నాను! ఇప్పుడు పనిచేసేదంతా నేనే గదోయ్, మానేజింగ్ డైరెక్టరుకు ఎ. బి. సి. డీలు రావు! (ఆలోచించి) ఐతే రాజీనామా పెట్టను.

మా : పోనీ ఇంటికివెళ్ళి తాపీగా ఆలోచించుకో!

ఆంజ : ఉహుఁ! నా ప్రాణం పోయినాసరే రాజీనామా మాత్రం ఇవ్వను! (ఆలోచించి) అయితే నాపేర నోటు రాసిస్తావా...డైరెక్టరుకు సరిపోయే మొత్తానికి; ప్రాంసరీనోటు రాయి! ఈ రెండేళ్ళూచూసి తర్వాత వచ్చి కలుస్తాను!

మా : (నవ్వుతూ) ఈలోపల ఏదైనా ఆపద వస్తుందేమోనని; కదూ? నే నున్నాను! నీకేం భయం?

ఆంజ : కాదు కాదు! ఇప్పుడు నోటురాయి! తర్వాత ఆలోచిద్దాం! (జేబులోనుంచి తెల్లకాగితం తీస్తూ) ఇదిగో! ఎక్కడైనా అప్పుచేద్దామని రివెన్యూ స్టాంపుగూడా జేబులో పెట్టుకుని తిరుగుతున్నా.

మా : ఇప్పుడే!

[ఆమె కాఫీతో ప్రవేశిస్తుంది.]

ముందు కాఫీ కానివ్వు! అన్నపూర్ణా! రాత్రికి ఆంజనేయులు భోజనం ఇక్కడే. మన ప్రయాణానికి అంతా సిద్ధం చేస్తున్నావా?

ఆంజ: ఎక్కడికి? (నోటు వ్రాయమని కాగితం అందించబోతాడు.)

మూ: (విషయం మార్చాలని) ఆc! అలా బొంబాయి వెళ్ళి కొందరు స్నేహితులతో మాట్లాడిరావాలి.

ఆంజ: అప్పుడే? ఏం ఆలోచించకుండానే? (మళ్ళీ కాగితం అందించబోతాడు. అతను చూడనట్లు నటిస్తాడు)

మూ: (డ్రాయర్‌నుంచి కాగితాలు తీస్తూ) ఇవిగో! ఐదు కంపెనీలు ప్రారంభించడానికి ప్రాస్పెక్టస్‌లు తయారుచేశాను. చదువుతా విను!

ఆంజ: (ఆదుర్దాగా) అవి తర్వాత చూద్దాం! ముందు నోటు రాయి! (రాస్తాడులే అనే సంతోషంతో) కాఫీ బాగుందమ్మాయ్!

[బైట తలుపుకొట్టిన ధ్వని. ఆంజనేయులు కంగారుపడతాడు.]

మూ: (ఆందోళనగా భార్యతో) ఎవరో చూడు! (ఆంజనేయులుతో) ఏమిటి వొణుకుతావ్?

ఆంజ: (గజగజ వొణుకుతూ) ఆc, నాకేం భయం! నువ్వుండగా!

[అన్నపూర్ణ వెళ్ళివెళ్ళకముందే కంగారుగా వచ్చేస్తుంది.]

అన్న: (కంగారుగా) వాళ్ళొస్తున్నారు!

మూ: ఎవరు?

ఆంజ: ఎవరు?

[ఇంతలో మేనేజింగ్ డైరెక్టర్ భగవంతరావు, అతని మిత్రుడు వస్తారు. భగవంతరావు వయస్సు సుమారు 45 వుంటుంది. సూటు వేసుకుని, హాండ్‌స్టిక్ ఊపుతూ ఠీవిగా వచ్చాడు. రెండవ వ్యక్తి యూనిఫారంలో వున్నాడు. కాని, అధికార చిహ్నాలేమీ లేవు. అతని చేతిలో హంటర్ వుంది.]

భగ : (సంతోషంతో) ఓ ! సో మాణిక్యం ఈజ్ హియర్ ! (మాణిక్యంతో) నీకు ఆశ్చర్యంగావుంటే మా కానందంగా వుందోయ్ ! (ఆంజనేయులుతో) నీవెప్పుడొచ్చావయ్యా ఆంజనేయులూ ?

[భగవంతరావు, అతని మిత్రుడు సిగరెట్లు వెలిగిస్తారు. మిత్రుడు మాణిక్యాలరావును దీక్షగా చూస్తూ, సిగరెట్ ఆఫర్ చేస్తాడు]

మా : (తడబడుతూ) నో, థాంక్స్ !

భగ : డోంట్ వర్రీ, యు కెన్ స్మోక్ ! యు ఆర్ యాన్ ఇండిపెండెంట్ మాన్ నౌ ! (ఈ లోపల మాణిక్యాలరావు సిగరెట్ తీసుకుని కాలుస్తాడు. ఆంజనేయులు బైటికి వెళ్ళే ప్రయత్నంతో లేచి నిలబడతాడు.) కమాన్ ఆంజనేయులూ ! కూర్చో ! నే నిప్పుడు మానేజింగ్ డైరెక్టరుగా రా లేదు. స్నేహితుడుగా వచ్చాను.

ఆంజ : (కంగారుగా) ఆఁ, నేనుకూడా ఇప్పుడే వచ్చానండి ! ఇతను హఠాత్తుగా కన్పించాడు; తమకు తెలియజేద్దామనుకుంటుంటే తమరే వచ్చారు !

భగ : దట్సాల్ రైట్ ! మేమంతా తెలుసుకున్నాం! నీకు బహుమానముంది కూచో !

[ఆంజనేయులు ఆ బహుమానమేమిటో అర్థం
కాక భయపడతాడు. కూర్చుంటాడు. ]

మాణిక్యం! వుయ్ ఆర్ వెరీ గ్లాడ్ టు మీట్ యూ!
(మిత్రుని చూపిస్తూ) వీరు నా ఆప్తమిత్రులు, మద్రాసు
లోనే వుంటువున్నారు! (మాణిక్యం భయం కప్పిపుచ్చు
కోవాలని నవ్వునటించే ప్రయత్నంలో వున్నాడు.)

భగ : (తాపీగా, పచారుచేస్తూ) ఏమిటోయ్! ఇన్నాళ్ళు బ్యాంకిలో
ఇంత నమ్రతగా పనిచేసినవాడివి; ఏదో అర్జెంటు పని
మీద వచ్చేశావట! రాజీనామా యిస్తావనుకుంటు
న్నారు! పోనీ సెలవు పెట్టకపోయావా!

మా : (సిగరెట్ పీల్చుతూ, ఉక్కిరిబిక్కిరై దగ్గుతాడు) ఎక్స్
క్యూస్ మి! (కూర్చుంటాడు.)

మిత్రుడు : (మాణిక్యాలరావు ఆందోళన గమనించమని భగవంత
రావువైపు చూస్తూ, మొదటిసారి నేరం చేసినవాళ్ళు
ఇలాగే అలజడిపడతారన్నట్లు) అలవాటు లేదు పాపం!
(మాణిక్యంతో) సిగరెట్ కాల్చడం!

మా : (ఏమిచెప్పాలో తోచక) సెలవు పెట్టకుండానే వచ్చా
నండి—

భగ : అన్నట్టు మీ అత్తగారి ఆస్తి కొంత నీకు సంక్రమించిం
దని—

మా : (తేరుకుంటూ) అవునండి!

భగ : అంతా విన్నాంలే! పెద్ద మొత్తే మనుకుంటున్నారు!
(మిత్రునితో) ఈ హంగామా చూస్తుంటే ఆ విషయం
తెలుస్తూనే వుంది!

మా : మా అన్నపూర్ణ సరదాతీరక ఇంత ఖర్చుపెట్టాం.

మిత్రు : ఎంత డబ్బు వచ్చిందేమిటి ?

మా : ఆఁ, ఎంతో లేదండీ—

భగ : వాట్ నాన్సెన్స్ మాన్ ! ఒక లక్షన్నరైనా అయివుంటుందని దేశమంతా పుకారుగా వుంటే—

మిత్రు : (హేళనగా) వెరీలక్కీ; ఏయ్ !–(హఠాత్తుగా) ఏమిటా లోచిస్తున్నావ్ ?

మా : (కంగారుగా) ఆఁ, అహాఁ, ఊహుఁ. ఏం లేదండి !

భగ : హోటల్లో చెప్పారులే, బొంబాయి వెళ్ళడానికి టిక్కెట్లు తెప్పించావని !

మిత్రు : వచ్చి ఎన్నాళ్లైందేమిటి, అప్పుడే బయలుదేరుతున్నావ్?

మా : (విషయం మార్చాలని) ఆఁ, ఇవాళ వుంటారా ?

భగ : తప్పుతుందా, వచ్చినపని అయ్యేంతవరకు కదలడానికి వీల్లేదు ! – (హఠాత్తుగా) అన్నట్టు, మొన్న వొక సంఘటన జరిగింది, నీకు తెలిసిందా ?

మా : ఏమిటండీ ?

భగ : ఏముంది, నీవు బయలుదేరిన మనాడే బయటపడింది ! (కోపం అణచుకుంటూ, గట్టిగా) బ్యాంకిసొమ్ము లక్షా యాభైవేలు కనబడలేదు, ఎంత వెతికినా—

మా : (ఆదుర్దా నటిస్తూ) దొరికిందా ?

మిత్రు : ఎలా దొరుకుతుంది ? అసలు మీరు విన్నారా ?

మా : (మిత్రుని సంభాషణ పట్టించుకోకుండా భగవంతరావుతోనే మాట్లాడతాడు) వెతికించి—

భగ : పట్టుకోమంటావ్ ! అందుకే బయలుదేరాం, నువ్వే కన్పించావ్ !

మా : (ఉద్రేకాన్ని కప్పిపుచ్చుకోలేక, లోపలికి వెళ్ళబోతూ) వస్తా !

భగ : (పెద్దగా ఆజ్ఞాపిస్తూ) మాణిక్యం! వెళ్ళవచ్చు కూర్చో !

మిత్రు : (కోపంగా) ఇటీస్ నాట్ ఎ జోక్ యంగ్ మాన్ !

భగ : (మర్యాదగా) నిన్నొక విషయంలో బ్రతిమాలటాని కొచ్చాను ! (మాణిక్యం కూర్చుంటాడు) బ్యాంకిలో డబ్బు తగ్గితే ఎన్ని చిక్కులు వస్తాయో, ఎంత బాధ పడాలో నీకు చెప్పనక్కరలేదు—అంటే మా బాధ ! ఇప్పుడా మొత్తాన్ని నీవేమైనా సర్దితే మర్యాదగా వుంటుంది—మాకు కూడా !

మిత్రు : (దబాయిస్తూ) మీరు వెంటనే హెల్ప్ చెయ్యకపోతే ప్రమాదం వస్తుంది.

మా : (ఇక తప్పదనుకుని, నిశ్చయానికి వస్తున్నాడు) నా దగ్గరేముంది ? (సిగరెట్ తీసి కాలుస్తాడు.)

మిత్రు : ఉంటుంది మూడు ! వాళ్ళు దగ్గరపెట్టుకుని చూస్తే కన్పిస్తుంది !

భగ : (ఆశ చూపుతూ) మళ్ళీ నీవు ఉద్యోగంలో చేరాలంటే; ఫర్వాలేదు, ఆలోచిస్తాం !

మిత్రు : కమాన్ మిస్టర్ ! ఇది నువ్వు చేసితీరాలి !

భగ : (గట్టిగా) గత్యంతరం లేదు !

మిత్రు : (ఇంకా గట్టిగా) తప్పదు !

మా : (ఎన్నడూ కలహాలు, పేచీలు అలవాటు లేనివాడు, హాఠా

త్తుగా ఎదురౌ్కన్న పరిమాణానికి కలవరపడుతూ, హీన
స్వరంతో) నో! నో! (లోపలికి పోబోతున్నాడు.)

మిత్రు: (ఆజ్ఞాపిస్తూ) స్టాండ్ దేర్ ఐసే!

భగ: (దబాయిస్తూ) మాణిక్యం! వాట్ డు యు థింక్!
ముందు జవాబు చెప్పు?

మా: (ధైర్యంగా ఎదిరిస్తూ) నో! నో! నో!

భగ: ఏమిటీ? ఆ డబ్బిక్కడ పెడతావా, అరెస్టు చేయించ
మంటావా?

మా: నా దగ్గరొక్క దమ్మిడీగూడ లేదు; (నిర్లక్ష్యంగా) మీ
యిష్టం!

మిత్రు: యూ స్కౌండ్రెల్!

భగ: పచ్చి దొంగ!

[అన్నపూర్ణ కోపం పట్టలేక చరచరా ప్రవేశిస్తుంది.]

అన్న: మీరే దొంగలు! మీరే హాయిగా కట్టుకుపొండి!
ఇన్నాళ్లూ మీకు చాకిరి చెయ్యబట్టే మాకీ గతి పట్టింది.

మా: (భార్య అనవసరంగా జోక్యం కలిగించుకున్నదని కోపంతో)
అన్నపూర్ణా! నువ్వు లోపలికి పద! ఇది నీ వ్యవహారం
కాదు! నే నున్నాను! (ఆజ్ఞాపిస్తూ) ఊఁ, పద!

[అన్నపూర్ణ అయిష్టంగా లోపలికి వెళుతుంది.]

మా: (జీవితాని కొకసారే ఈ అవకాశం అన్నట్టు, నిర్లక్ష్యంగా
ఎదిరిస్తూ) ఏం చేస్తారు! చర్య తీసుకుంటారా! ఊఁ,
కానివ్వండి! ఈ రెండింటిలో ఏదో వొకటి జరుగుందని
నాకు తెలుసు! నేను సిద్ధపడే వున్నాను!

భగ: దేనికి సిద్ధపడావ్?

మిత్రు : మేమూ సిద్ధంగానే వచ్చాం !

మా : తప్పించుకొని, హాయిగా విలాసంగా జీవించడమో, పట్టుబడి లొంగిపోవడమో...నాకు ముందే తెలుసు !

మిత్రు : ఇటీస్ టూమచ్ !

భగ : ఏం తెలుసు నీకు ? ఆత్మగౌరవం లేకుండా, నీతి అవినీతి అనేది లేకుండా చేతికి దొరికినడబ్బు అపహరించి పారిపోయివచ్చి, ఇంకా ఎదిరిస్తున్నావ్ !

మిత్రు : ఆ డబ్బెక్కడుందో చెప్పు ! అది ముందు తేలాలి !

మా : ఒకసారి కాదు, లక్ష సార్లపహరిస్తాను. ఏం చేస్తారో చెయ్యండి ! అవును ! నాకు ఆత్మగౌరవం లేదు ! అభిమానం ఆదరణలేని లోకంలో ఆత్మగౌరవం ఎలా వుంటుంది ! ఏం ! నీలాగ సుఖంగా వుండాలని నాకు మాత్రం కోరిక వుండదూ ? నీలాగ కొడుకుని ఇంగ్లండ్ పంపించాలని ఆశ వుండదూ ? నేనుమాత్రం....అమాయకుల నోళ్లుకొట్టి పదిలక్షల డబ్బు సంపాదిస్తే అయిన వాటికీ కానివాటికీ దానం చెయ్యలేనూ ?

భగ : (హేళనగా) న్యాయంవుంది. కోర్టులున్నాయి. మరిచిపోయావేమో !

మిత్రు : భగవంతరావుగారూ ! ప్రయోజనం లేదు. విషయం తేలాలి.

మా : ( భగవంతరావుకు సమాధానం చెపుతూ ) అనుక్షణం వాటినిగురించే ఆలోచిస్తున్నా ! అవి నా దుర్గతిని పట్టించుకున్నాయా ? లేదు ! నా శ్రేయస్సు మీకక్కరలేదు. మీ శ్రేయస్సు నా కనవసరం !

భగ : నీకు అంతరాత్మ లేదు !

మా : నాకు తెలుసు ! ఈ అంతరాత్మ ఎక్కడిది? ఎలావచ్చింది? పుట్టినప్పటినుంచి మీ నీతులు, ధర్మాలు ఉగ్గుపాలతో నూరిపోసిన నా అంతరాత్మ మీ పెంపుడు కుక్క ! అది నా శత్రువు !

మిత్రు : (కైం చూసుకుంటూ) భగవంతరావుగారూ ! ఇంకెంత సేపు ! తెగించినవాడు ఎన్ని ఉపన్యాసాలైనా చేస్తాడు; ఇవన్నీ వినడానికి మనకెక్కడ తీరుతుంది !

మా : (కోపంతో) అవును ! మీ కెక్కడ తీరుతుంది? ధర్మాన్ని నాలుగు పాదాలమీద నడిపించి లోకాన్ని నిలబెట్టే మహాత్ములు ! కాని, ఇవి ఉపన్యాసాలుకావు, కష్టాలతో నా రక్తం ఉడికిపోతే నేర్చుకున్న పాఠాలు ! మీరు వినడానికి భయపడే అమూల్య సత్యాలు !

భగ : ఆ డబ్బెక్కడ దాచావో చెప్పు?

మిత్రు : లేకపోతే తెల్లవారేలోపల నీ వొళ్ళు గుల్ల అవుతుంది.

మా : (గట్టిగా) నేను చెప్పను ! మీరు నన్నడిగి ప్రయోజనం లేదు !

భగ : (మిత్రునితో) ఏం చెయ్యాలండీ ?

మిత్రు : నేను చూస్తాను! వొళ్లు కొవ్వెక్కి మాట్లాడుతున్నాడు.

భగ : (మిత్రుని చూపిస్తూ, మాణిక్యంతో) ఆయ నెవరనుకున్నావ్ ? నాగేంద్రరావుగారంటే ఆయనే ! కమీషనర్ ఆఫ్ పోలీస్ ! హోటల్ చుట్టూ బందోబస్తు వుంది!

[ హోటల్ బయటనుంచి అప్పుడప్పుడు పోలీస్ ఈలలు రంగం చివరివరకూ క్రమంగా హెచ్చుతూ విన్పిస్తాయి. ఆంజనేయులు గజ గజ వణకుతూ బైటికి వెళ్ళడానికి ప్రయత్నిస్తాడు. ]

భగ : ఆంజనేయులూ! కూర్చో! నీకు బహుమానం తప్పదు!

కృష్ణ : (ఈలలు విని బైటినుంచి కంగారుగా పరుగెత్తుకుంటూ వచ్చి) నాన్నా! (అంటాడు. ఆ పరిస్థితి గమనించి హడలి పోతాడు.) అమ్మా! అమ్మా! (లోపలికి పరుగెత్తుతాడు.)

నాగేం : (దబాయిస్తూ) డబ్బెక్కడదాచావో చెపుతావా, బేడీలు తగిలించమంటావా?

మా : నేను చెప్పను; మీ యిష్టం; మీ రేం చేసినా సరే!

[ ఈలలు హెచ్చుతున్నాయి. ]

నాగేం : చెప్తావా లేదా?

భగ : అరెస్టు చెయ్యండి!

మా : నేను చెప్పను!

నాగేం : (ఆగ్రహంతో) చెప్పవూ!

[ గట్టిగా మాణిక్యాలరావుమీద విరుచుకుపడి కొడతాడు. బైటి నుంచి ఈలలు ఒక్కసారిగా విన్పిస్తాయి. అన్నపూర్ణ, కృష్ణ గొల్లున ఏడుస్తూ బైటికివచ్చి మాణిక్యాలరావును కౌగలించుకుంటారు. తెర మెల్లమెల్లగా జారుతుంది. ]

---

# స్వాప్నిక జీవితం :

## ద్వితీయాంకము

[ మద్రాసులోనే ఒక మారుమూల పేటలో, ఒక సత్రంలో గది. మూలలనిండా బూజు. గోడలనిండా మరకలు. ఇంతకుముందు ఉండి వెళ్ళినవారి చిహ్నాలు, బొగ్గుగీతలు, బొమ్మలు మొదలైనవి. ఒక పక్క చేయివిరిగిన కుర్చీ, బల్ల; మరొకపక్క మంచం వుంటాయి. గది మధ్యలో పాత 'ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ' పత్రికల గుట్ట. అన్నపూర్ణ పాతగొడుగు వూచలు బాగుచేస్తున్నది. సమయం మధ్యాహ్నం. కృష్ణ విచారంగా ప్రవేశిస్తాడు. ]

అన్న : (నీరసంగా) ఏం కృష్ణా, ఇంత ఆలస్యంగా వచ్చావ్ !

కృష్ణ : (విసుగ్గా) ఏం చెయ్యమంటావమ్మా, ఎన్ని గదులు తిరిగినా ఎవ్వరూ మాట్లాడటంలేదు.

అన్న : అసలు ఎవరినైనా అడిగావా లేదా ?

కృష్ణ : ఆఁ, అడుగుతారు ! (కోపంగా) ఏం, అప్పు కావాలంటే నాన్ననుపోయి అడగమనరాదూ, మాటిమాటికీ నన్ను పంపుతావ్ !

అన్న : నాన్నకూడా ప్రయత్నం చేస్తున్నార్రా ఉద్యోగంకోసం.

కృష్ణ : ఊఁ, ఉద్యోగం కావాలని మద్రాసంతా తిరగకపోతే మనవూరు పోకూడదూ....అమ్మా ! అయితే మనం అసలు వూరికెళ్ళమా......పోదామమ్మా; నా మాట వినమ్మా; నాన్నతో చెప్పు......నాకే మన బాబుని చూడాలని వుంది.

[అన్నపూర్ణకు ఏడుపు పొంగివస్తుంది. కృష్ణకు కనపడకుండా చెంగు ముఖానికి అడ్డంపెట్టుకుంటుంది. కృష్ణ గమనిస్తాడు. వెంటనే తల్లి దగ్గరికి వెళ్ళి కూర్చుని, గడ్డంపట్టుకుని ఓదార్చుతాడు.]

కృష్ణ : ఊరుకో అమ్మా! నువ్వట్లాప్రుంటే నా కేడుపొస్తుంది! ఊరుకో! 'ఏం బాబూసంగతిన్నావనా? అననులే!

అన్న : నాకుమాత్రం లేదూ బాబుని చూడాలని: ఈ సత్రంలో ఇట్లా అవస్థపడటం నాకు ఇష్టమనుకున్నావా?

కృష్ణ : ఐతే నాన్నతో చెప్పమ్మా, వెళ్ళిపోదాం! ఏం మళ్ళీ వెళ్ళి అడిగితే నాన్నకు ఉద్యోగం ఇవ్వరూ? బాగానే ఇస్తారు! నాన్నకంటె మంచివాళ్ళు వాళ్ళకు దొరుకుతారా యేం?

అన్న : ఇంతపని జరిగిన తర్వాత ఏ ముఖం పెట్టుకుని పోతాం! (వెంటనే ప్రస్తుతస్థితి జ్ఞాపకంవచ్చి) డబ్బేమైనా ఇచ్చారా?

కృష్ణ : నువ్వు కొట్టినావనే, ఇకనుంచి అప్పు అడగటానికి నేను పోనమ్మా! నన్ను చూస్తే అందరూ ఏడుపుముఖాలు పెట్టుకుని నవ్వుతున్నారు!

అన్న : (చిరునవ్వుతో) అందరూ ఏడుపుముఖాలు పెట్టుకుని నవ్వుతున్నారా? అంతే నాయనా, లోకం అంతే! కొందరు నవ్వలేక ఏడ్చేవాళ్ళు; కొందరు ఏడ్వలేక నవ్వే వాళ్ళు! — ఏదీ? (చెయ్యి సాచుతుంది)

కృష్ణ : ఇదిగో!

అన్న : (ఆశ్చర్యంతో) ఇంతేనా? మూండణాలేనా? హుఁ! పాపిష్టి బ్రతుకు!

కృష్ణ : అమ్మా ! మనదగ్గర డబ్బుందటగా, నాన్న ఎక్కడైనా దాచిపెట్టాడేమో !

అన్న : ఎవరన్నార్రా ? రెండేళ్ళు శిక్ష అనుభవించి ఆయనొస్తే ఆరు నెలలనుంచి అర్ధాకలితో వుంటే; ఎలా అనుకుంటారో !

కృష్ణ : ఆ పక్కింటి అబ్బాయన్నాడమ్మా, 'ఆ డబ్బులో ఏం మిగల్చలేదా ?' అని !

అన్న : హుఁ ! చూస్తూ చూస్తూ కడుపుకోసే మాటలు ఎలా అంటారో !

కృష్ణ : అమ్మా ! ఇందులో నాకొక బేడా ఇయ్యవమ్మా, చాక్లెట్లు కొనుక్కుంటా !

అన్న : వద్దు నాన్నా ! ఆకలితీరదు! పో, ఈ మూడణాలకూ అరటి పండ్లు తీసుకురా ! (డబ్బు అతనిచేతి కిస్తుంది.)

కృష్ణ : నాన్న రాలేదేం ?

అన్న : త్వరగా వెళ్ళిరా నాయనా ! ప్రొద్దుటినుంచి రెండరటి పండ్లతో వున్నావ్ ఆకలి కావడంలా ? నాన్న ఎక్కడో వొకచోట తినేవుంటారులే !

కృష్ణ : (వెళ్ళిపోతూ) అమ్మా ! ద్రాక్షపండ్లు తెస్తానే; తియ్యగా పుల్లగా కమ్మగా భలే బాగా——

అన్న : వద్దువద్దు ! ఆకలి తీరదు ! అరటిపండ్లు తీసుకురా; బాగా పండినవి చూడు ! (కృష్ణ వెళ్ళిపోతాడు.)

కృష్ణ : (బయటనుంచి) నాన్న వస్తున్నాడే ! (అని కేక వేస్తాడు.)

[ అన్నపూర్ణ ఆదుర్దాతో అతను వస్తున్నాడేమోనని గమనించి చూస్తూ, నారింజపండు తీసి దాచిపెడుతుంది.

మాణిక్యాలరావు వీధులన్నీ తిరిగి, రేగిన జుట్టుతో, నీరసంగా ప్రవేశిస్తాడు. నిండా కప్పుకున్న ఉత్తరీయం తీసి కుర్చీమీద వేస్తుంటే, చొక్కా అంతా చిరిగిపోయినట్లు కనిపిస్తుంది.]

పూ : ఉత్తరమేమైనా వచ్చిందా?

అన్న : (విసుగుగా) ఎక్కడినుంచి?

మా : (అతని నీరసం కోపంగా మారి) ప్రతిరోజూ చెప్పాలా యేమిటి, పజిల్‌వాళ్ళ దగ్గర్నుంచి!

అన్న : ప్రతిరోజూ పాఠం చెప్పాలా యేమిటి రాలేదని? పజిలట పజిల్, అది రావడమూ మనం అనుభవించడమూ!

మా : (ఆమె నిర్లక్ష్యవైఖరిని గమనించి చూస్తాడు. తల వంచుకుంటాడు) హుం! మొన్న పంపినదానికి తప్పకుండా ప్రైజ్ వస్తుందనుకున్నా! (ఆలోచిస్తూ) పైగా ఈసారింకా పంపలేదు!

అన్న : (ఎగతాళిగా) ఏం, ఎవరైనా జోస్యం చెప్పారా, ప్రైజ్ వస్తుందని?

మా : ఆఁ, ఎవరు చెప్తారు? పత్రికలో వారఫలితాలు చూశాను.

అన్న : (ఆశగా) ఇంకా ఏం రాశారు? ముందుముందు ఏమన్నా ఆశ వుందని రాశారా?

మా : (జేబులోనుంచి పత్రికలో కత్తిరించిన కాగితంతీసి తాపీగా చదువుతాడు.) 'ఈ వారంలో మీ యోగం కొన్ని విషయాలలో అద్భుతంగాను, మరికొన్ని విషయాలలో అన్యాయంగాను వుంటుందని చెప్పవచ్చును. బంధువుల వల్ల ఏమీ సహాయం జరగదు. స్నేహితులవల్ల మాత్రం

కొన్ని కష్టాలు సంభవిస్తాయి. ఆదివారంనాడు ఈ జాత కుడు మహారాజులతోనైనా మాట్లాడవచ్చును. కాని, ఈ వారమంతా సమృద్ధిగా గృహకలహాలుంటాయి'— ఏం, పోట్లాడతావా ?

అన్న : నేను పోట్లాడబట్టే ఇలా వున్నారు. (కష్టంగా) ఐనా నాదేం పోయింది. నేను రేపో మాపో మా ఇంటికి బయలుదేరతాను.

మా : (కోపంగా) ఇక ఇంటికి వచ్చినప్పట్నుంచీ ఇదే మొదలా ?

అన్న : మొదలూ లేదు, చివరా లేదు మన కష్టాలకు ! నేనూ మనిషినే ! ప్రొద్దుటినుంచీ నేను మెతుకైనా ముట్టకుండా ...వాణ్ణి రెండరటిపండ్లతో పస్తుంచి, మీరేమో స్నేహి తులతో హాయిగా—

మా : (ఏడ్వలేక నవ్వుతూ) అవును ! హాయిగా...పంచభక్ష్య పరమాన్నాలతో విలాసంగా—

అన్న : ఏం కాదా ? లేకపోతే ఇంట్లో ఏం తినకుండా ఎలా వుంటున్నారేం !

మా : వెర్రిదానా ! నీతో చెప్పనంతమాత్రాన లేనిపోనివన్నీ ఊహించుకుంటావా ?...ప్రొద్దున బయలుదేరి వెళ్లానా ......తారురోడ్డుమీద తిరిగి తిరిగి కాళ్ళు బొబ్బలు పొక్కినై...పార్కులో కొంచెంసేపు పడుకుని...పైపు నీళ్ళు తాగి—

అన్న : (నమ్మలేక కోపంగా) అన్నీ కట్టుకథలు, నా దగ్గర చెప్ప కండి ! ప్రొద్దుటినుంచి ఎందుకు రాలేదు ? నిన్నంతా

మేం ఒక్క కప్పు కాఫీతో గడిపాంగదా ! ఇక్కడ మా
గతేం కావాలి ?

మా : (నవ్వుతూ) మీరు నాకంటే నయం ! పడుకోవడానికి పంచవున్నా వుంది. ఇంటికి రావాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా సత్రంచుట్టూ ఎన్నిసార్లు తిరిగినా గేటులో సత్రం జవాను సిద్ధం ! వాడికి కనిపిస్తే అద్దెకోసం వేట కుక్కలాగ ఎగబడతాడని భయం ! పట్నమంతా తిరిగి ఎంతోమందిని ప్రాధేయపడ్డా; మీ పిల్లలకు చదువు చెప్తా అన్నా ! మన కష్టాలెవ్వరికీ తెలియవుగాని, మన పరువు ప్రతిష్ఠలంతా విన్నవారే ! నన్ను చూడగానే; 'మీరేనా, జైలుకెళ్ళొచ్చినట్టా, బైటికెప్పుడొచ్చారు ?' అంటుంటే నా ప్రాణం చచ్చిపోయింది !

అన్న : ఏం ! అసలు జైలుకెళ్ళలేదని చెప్పలేకపోయారా ?

మా : (గొప్ప విషయమైనట్టు) పత్రికల్లో పడింది ! బైటికొచ్చి ఆరునెల లయిందండీ అంటే ఒకాయనన్నాడుగదా, 'మీకేమండీ రెండేళ్ళు ఖైదులో వుంటే, ఇరవైయేళ్ళు హాయిగా వుండొచ్చు.'

అన్న : హుం ! వాళ్ళు మనుషులు కారు !

మా : (వెగటుగా నవ్వుతూ) ఎందుకు కారు ? అంతా మనుషులే! పెద్ద మనుష్యులు ! ఈ పెద్దమనుష్యుల తత్త్వం నీ కర్థం కాదు. ఈ కచేరీలు, ఖైదులు, అవమానాలు అనుభవించాలంటే భయంగాని, ఏమాత్రం అవకాశమున్నా అపహరించి ఆనందించాలని అందరికీ వుంటుంది! (నవ్వుతూ దుఃఖం పైకుబికి, నీరసం హెచ్చి, ఉద్రేకం పొంగితే)

నిజంగా ! నిజంగా ! అన్నపూర్ణా ! ఈ పెద్దమనుష్యు లందరికీ నేను ఆదర్శ పురుషుణ్ణి !

అన్న : (ఆశ్చర్యంతో) ఏమిటా వెర్రివాలకం ? ఊరుకోండి !

[ మాణిక్యాలరావు నీరసంతో కళ్లుతిరిగి బల్లమీద తల వాల్చుతాడు. రెండుచేతులతో తల పట్టుకుంటాడు.]

అన్న : (భయంతో కంగారుగా) ఏమిటి ? అలా వున్నారేం ? ( ఆందోళనగా ) ఏమిటండీ ? చెప్పండి ? ( ఏడుస్తుంది. వెంటనే లోపలికివెళ్ళి, గ్లాసుతో నీళ్ళుతెచ్చి చల్లుతుంది. మనసుల్లో ప్రేమఅంతా వెలికివచ్చి దుఃఖంగా మారుతుంది. కొంగుతో ముఖమంతా తుడుస్తుంది.) ఇప్పుడెలా వుంది (ఏడుస్తూ) నాకు తెలియదు. నే ననుకోలేదు. (అతను ఆమె సహాయంతో వెళ్ళి మంచంమీద కూర్చుంటాడు.) ఏం, కండ్లు తిరుగుతున్నాయా ? చెమటపడుతుందేం ? చూడండి ! ఇటు చూడండి ! (చూస్తాడు) నామీద కోపం వచ్చిందా ? (రెండుచేతులూ పట్టుకుని) ఈ దురదృష్టం నాదేనేమో ! నేను మీ ఇంటికి వచ్చినప్పట్నుంచి మీకు సుఖమే లేదు.

మా : (తేరుకొని ఆమెతల నిమురుతూ) అంతకు ముందుగూడా లేదు. మన జీవితాలన్నీ ఇంతే ! మనం బ్రతకవలసిన అవసరం లేదు; పుట్టాంగనుక చూస్తూచూస్తూ చావలేక బ్రతుకుతాం !

అన్న : అసలు అన్నం తినలేదా ?

మా : నిన్నప్రొద్దున నీ విచ్చిన కప్పు కాఫీతప్ప....ఆకలైనప్పుడల్లా కడుపునిండా పైపునీళ్ళు తాగాను......ఎండలో

నడుస్తూ రెండుసార్లు స్పృహతప్పి పడిపోయాను !

అన్న : (కన్నీళ్ళు తుడుచుకుంటూ మెల్లగా వెళ్ళి, తానింతసేపు దాచిపెట్టిన నారింజపండు తీసి, వొలుస్తూ) ఇదిగో, నారింజపండు తీసుకోండి, తగ్గిపోతుంది ! నాతో చెప్ప లేదేం ! (ఏడుస్తూ) నాతో ఏదీ చెప్పరు, ఏదీ చెప్పరు ! నేనింకా చచ్చిపోలేదుగా, మీ రొక్కరే బాధపడతా నంటారు ! మీ రొక్కరే సుఖపడతానంటారు ! అంతా రహస్యమేనా ? అదికూడా చెప్పలేదుగా !

మా : (రహస్యం జ్ఞాపకంవచ్చి, అపరాధిలా బాధపడుతూ, కప్పి పుచ్చుకోవడానికి కోపం తెచ్చుకుని) ఏది ! ఆ విషయ మేనా ? ఆ డబ్బంతా నాకే కావాలని నే నన్నానా ? మీకు ఏం కావాలంటే అవి కొనియివ్వాలా ? మీకోసం గదూ నేను చేసింది !

అన్న : మరి లక్షాయాభైవేలు తీసుకొచ్చి, యాభైవేలని అబద్ధ మాడవచ్చేం ?

మా : దొరికినంత సొమ్ము తీసుకొస్తే తప్పులేదు, గాని నీతో చెప్పకపోవడం మాత్రం తప్పంటావన్నమాట ! (వెగ టుగా) భార్యలు !

అన్న : దొంగసొమ్ము ఎంతయితే ఏంలెండి, దక్కితేగదా !

మా : (ఉగ్రుడై) మళ్ళీ అను చెప్తాను...కృతఘ్నురాలా ! మీ ఆశలు, కోరికలు నెరవేరాలనేగా నేను చేసింది !..... లోకమంతా నన్నాడిపోస్తుంటే నీవుగూడా...నీవుగూడా ...నేర్చుకుని నన్ను నిందిస్తున్నావా ? ఇదేనా నీ ——
(కొట్టబోతాడు.)

అన్న : (ఏడుస్తూ) కోపం వరదలా వచ్చేసింది, క్షమించండి! మళ్ళీ ఆ విషయం ఎత్తితే ఒట్టు! — నేనుమాత్రం మీ కష్టాలలో భాగం పంచుకుంటూ—

మూ : (గద్గదంగా, ఏడుపు కప్పిపుచ్చుకుంటూ) మరెందుకలా— అలా అన్నావ్ ?

అన్న : (కోపం వారిస్తూ) వద్దు, వద్దు, కోపం వద్దు.....ఇటు చూడండి.....(నవ్వించాలని) పోయిందా! ఇదిగో, (నారింజపండు చూపిస్తూ) ఒకసారి నవ్వండి! మిమ్మల్నే మరి!

మూ : (నవ్వుతూ) దొంగపిల్ల! (నవ్వూ, దుఃఖం కలిసివచ్చి) మరి అలా అనవుగదూ, నేను భరించలేను! గడపదాటితే అపనిందలతో అవమానాలతో కాలిపోతున్నా! నువ్వైనా (తడబడుతూ) నువ్వైనా నన్నర్థం చేసుకోకపోతే ఎలాగ!

అన్న : అవును లెండి, ఆ ప్రసక్తే తీసుకురాను; మరి కష్టపడి ఏదైనా ఉద్యోగం—

మూ : నువ్వే చూస్తున్నావ్‌గా, రోజుకొక పేటచొప్పున, అభిమానం చంపుకుని, ఎక్కనగడప దిగనగడప అనకుండా—

అన్న : (ఓదార్చుతూ) నాకు తెలుసు! ఏదో ఒకటి చూడండి!

మూ : ఏమో! ఏమౌతుందో! ఉద్యోగం దొరకదు; స్వయంగా సంపాదించే స్తోమత లేదు. కానీ...అన్నపూర్ణా! ఊరికి వెళతావా? నన్నిలా వదిలిపెట్టి...(ఆవేదనతో) వద్దు, వద్దు, నేనొక్కణ్ణే బ్రతకలేను!

అన్న : వెళ్ళను లెండి!...చూస్తూ చూస్తూ ఎలా వెళ్ళగలను! (తను కోపం తెచ్చుకున్నందుకు సిగ్గుపడుతూ) ఏదో,

చాలా రోజులయింది, అబ్బాయినొకసారి చూసివద్దామని పించింది! మీకుమాత్రం—

మా : (విచారంగా) నేను వాణ్ణి చూసి మూడేళ్ళయింది! ఇన్నాళ్ళూ వాడి ఫోటోఅయినా దగ్గర లేదు! కాని... ఇప్పుడు, నీవు. వెళ్ళొద్దమ్మా! చూడు! నీ వొక్క-దానివి నాకు అండగావుంటే ఈ లోకంమీద కత్తిగట్టి పోరాడిఅయినా జయిస్తాను! నువ్వుంటూ; నాకు భయం లేదు!

[కృష్ణ చేతిలో అరటిపండ్లు పట్టుకుని వస్తాడు.]

కృష్ణ : నాన్నా! 'నీ వచ్చావా' అని సత్రం జవాను అడుగు తున్నాడు.

మా : ఏం చెప్పావ్? ఇంటికి రా లేదనకపోయావా?

కృష్ణ : అట్లాగే చెప్పా! 'హూఁ! మీ అమ్మ చెప్పమన్నదా? నే నొస్తున్నానుండు!' అని కొట్టబోయాడు. నాకు భయమేసింది!

అన్న : (భర్తతో) ఇక వాడూరుకోడు; ప్రొద్దుటినుంచి గడపలో కూర్చుని ఇప్పుడే పోయాడు! కృష్ణా ఏవీ? (అరటిపండ్లు తీసుకుని లెక్కపెడుతుంది) మూడణాలకు తొమ్మిదేనా? (పంచిపెడుతూ, కృష్ణతో) నాన్నగారికి రెండివ్వు, (భర్తతో) మీకు రెండు సరిపోతాయిగదూ, వాడికి మూడు, మిగిలినవి నాకు!

మా : (రెండుపండ్లు అందుకుని, కోపంతో) నాలుగా! నీకు నాలుగా!

అన్న : (సిగ్గుపడుతూ) ఆకలౌతున్నవి. నిన్నటినుంచీ—

మా : (కళ్ళు ఒత్తుకుంటూ, చేతిలోని పండ్లు నేలమీద విసిరికొట్టి) ఎవరి బ్రతుకు వాళ్ళు చూసుకుంటే సరి... అన్నీ వుంటే అంతగా మాటాడినోళ్ళే! కష్టాలొచ్చినప్పుడే పెద్దపులుల్లాగ పీక్కుతింటారు

అన్న : (ఆగ్రహంతో) మీ ఆ సేవా కట్టలేదు; ఉన్న నగలన్నీ తెగనమ్మి ఈ రెండేళ్ళూ తిన్నాం; మీరు జైలుకి వస్తారంటే జైలు గుమ్మానికి పరిగెత్తుకొచ్చాం; మీరు మద్రాసు లోనే వుందామంటే సరేనన్నాం; ఆఖరికి ఉంగరం తాకట్టుపెడితే అదీ అయిపోయింది!

మా : మీ వంశమంతా ఇంతే!

అన్న : (మరీ ఆగ్రహంతో) నన్నంటే పడతానుగాని, మా వాళ్ళసంగతి మీ కెందుకు? వాళ్ళేమైనా మీ గోడ వేస్తున్నారా?

మా : ఎందుకేడుస్తావు! నానా అవస్థపడి నేను నరకంలోనుంచి బైటపడితే, 'వీళ్ళ గతేమైందో కనుక్కుందాం' అని ఒక్క ఉత్తరంముక్క రాశారా? రాస్తే ఎక్కడ వాళ్ళమీదకి పోయి పడతామో అని!

అన్న : (నిర్లిప్తంగా) చాల్లెండి! మీరు సంపాదించి సంతర్పించిన నష్టం దండుగగాని!

మా : (కోపంతో ఆమెను కొట్టడానికి మీదికురుకుతూ) ఇంత టెక్కో చెప్తావా, ప్రాయశ్చిత్తం కావాలా?

[ వెంటనే ఎవరో ప్రవేశించడం చూసి చటుక్కున పూలకొమ్మల వెనక్కు తగ్గుతాడు. ]

అన్న : (పకపకా నవ్వేస్తే భర్త చూస్తే ఏమౌతుందోనన్న భయంతో, రహస్యంగా) ఊరుకోండి, సీతారావు వస్తున్నాడు!

[ఇద్దరూ నిశ్చేష్టులై నిలబడతారు.]

కృష్ణ : (అరటిపండు తింటూ వచ్చి) ఎప్పుడూ యింతే! మిమ్మల్ని చూస్తే నా కసహ్యం వేస్తోంది! (బైటికి వెళ్ళిపోతాడు. భార్యాభర్తలు సిగ్గుపడతారు.)

[సీతారామయ్య తలచుట్టూ దారాలతో కట్టిన చత్వారపు కళ్ళద్దాలు, వెళ్ళాడే తవదికాని పొడుగాటి చిరిగిన కోటు — పోలికల్లో: మన సత్త్వంలో అంతా హెడ్ గుమాస్తా ఆంజనేయులు లాగే వున్నాడు.]

సీతా : (తూలుతూ ప్రవేశిస్తూ) నేనే నమ్మాయ్! ఏమిటలా బొమ్మల్లా నిలబడ్డారు! (నవ్వుతూ) భార్యాభర్తలు సరసా లాడుకుంటున్నారెట్లా! (మాణిక్యంతో) ఆఫీసు కెళ్ళి వస్తున్నావా?

అన్న : (ఆశ్చర్యంతో) ఏ మాఫీసు?

సీతా : ఉద్యోగం! (మాణిక్యంతో) సెలవు పెట్టావా యేం?

అన్న : (ఇంకా ఆశ్చర్యంతో) ఆఫీసేమిటన్నయ్యా?

సీతా : మనవా డమ్మాయ్; ఏమిటాశ్చర్యంగా మాట్లాడతావ్! (ఆలోచిస్తూ) ఆఫీసులో ఇంకా జీతంరాలేదని మొన్న జవానుతో అంటుంటే విన్నాలే!

మా : (ఆడిన అబద్ధం జ్ఞాపకంవచ్చి) ఆఁ, ఆఁ; ఆఫీసునుంచే వస్తున్నా; అలా చల్లగాలికి షికారుగా వెళ్ళి.....

సీతా : (ఆశగా) అయితే జీతం వచ్చిందా?

మా : ఊఁ, ఇంకా రాలేదు; ఇదిగో అదిగో అని ఊరికే వాయిదా వేసి చెప్తున్నారు !

సీతా : ఎంకా ఎన్నాళ్ళోయ్ ! (ఆలోచిస్తూ) ఆఁ, ఏమీ లేదూ ...ఒక ఐదు రూపాయలుంటే సర్దుతావేమోనని...

అన్న : (నిజం దాచలేక) ఎక్కడున్నయ్యా, మాకే దిన దిన గండంగా వుంటే—

మా : (వెంటనే అందుకుని) అంటే జీతం వచ్చేవరకూ......

సీతా : (దిగులుగా) నేను చేసిన పాపం అనుకోవాలె !

అన్న : ఏం, నీ వ్యాపారం బాగా నడవటం లేదూ ? సెకండ్ హాండ్ సామాన్ల దుకాణం పెట్టానంటివే !

సీతా : ఫస్టుగావుంది ! సామాన్లన్నీ అమ్ముడుపోయినై !

అన్న : మరికేం ! నువ్వే మాకు అప్పు పెట్టనచ్చుగా ?

సీతా : బాగా అన్నావ్ ! సామాన్లు లేవుగా, ఇంక అసలు దుకాణమేదీ ?

అన్న : ఏం, సెకండ్ హాండ్ సామాన్లకు కూడా కరువైందా ? దుకాణం లేకపోతే వ్యాపారమేం చేస్తావ్ ?

సీతా : (నవ్వుతూ) అదేనమ్మోయ్ విచిత్రం ! అమ్మకపోతే డబ్బురాదు, అమ్మితే వచ్చిన డబ్బంతా వెంటనే ఖర్చైపోతుంది ! అమ్మినా అమ్మకపోయినా అవస్థ తప్పడం లేదు !

మా : (నవ్వాపుకోలేక, ఛలోక్తిగా) మా దగ్గర సామాన్లకోసం వచ్చావా యేం ?

సీతా : ఊఁ...సత్రం జవాను కేకలువిని, అద్దెకోసం బయలుదేరాడేమో తప్పించుకుందామని, తాళంవేసి చక్కా—

వచ్చాను! ఇవాళ వాడి ధోరణి పట్ట పగ్గలులేకుండా వుంది! (తాపీగా గది కలయజూస్తూ) నీ దగ్గ రేమున్నాయ్ అమ్మడానికి?

మా : (నవ్వుతూ) ఇదిగో, ఈ కుర్చీ ఎంతకు కావాలో చెప్పు!

సీతా : మంచివాడివే! ఆ కుర్చీ, బల్లా స్వతాసవిగా!

మా : (పెద్దగా వెర్రిగా నవ్వుతూ) అయితే కేఁ నే నిస్తాను. తీసుకుపో! ఏం, ఇదేమన్నా దొంగతనమా?

సీతా : ఇక నీ దగ్గర నేర్చుకోవాలి!

[ఆమాట వినగానే మాణిక్యాలరావు మనసులో పిడుగుపడి నట్లవుతుంది. నిర్ఘాంతపోయి భార్యవంక చూస్తాడు. భార్య గ్రహించి తల వంచుకుంటుంది.]

సీతా : (ఇదంతా తెలుసుకోక) అమ్మాయ్; ఒక కప్పు కాఫీ వుంటే చూడమ్మా; గొంతుతడి ఆరిపోతూంది!

అన్న : లేదన్నయ్యా కాఫీపొడి అయిపోయింది (కల్పిస్తూ) వారిని తెళ్ళగమ్మని ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోరు!

సీతా : ఒక అర్థరూపాయి ఇవ్వరాదూ నేనే తెప్పిస్తా! (ఎదురు చూస్తాడు. అన్నపూర్ణ మాట్లాడదు) ఏం? మొన్న ఇలాగే చెప్పి తీసుకుపోయి మళ్ళీ రాలేదనా? ఇప్పుడు తప్పకుండా కొనుక్కొస్తా! (ప్రాధేయపడుతూ) మా తల్లిగా! ఒకబొట్టు కాఫీ పడకపోతే ఈ జీవుడు నిలవడు!

( బైట సత్రంజవాను కేకలు విన్పిస్తాయి. "ఏయ్, రేపొద్దిటికి డబ్బియ్యకపోతే సామాను గీమాను లాగి పారేస్తా; ఏమిటయ్యా మీా మొఖమాటాలు, ముందు అద్దెడబ్బు లియ్యి, తర్వాత మర్యాదలు చూసుకుందాం.

ఇదిగో, నేను తలుచుకుంటే ఎంతపనైనా చెయ్యగలను"
ఈ కేకలు వింటూ అందరూ నిశ్శబ్దంగా, భయంగా
నిలబడతారు.)

సీతా: (హఠాత్తుగా లేచి) వస్తున్నాడు, జవానొస్తున్నాడు, వస్తా! (వెళ్ళిపోతూ తిరిగివచ్చి) అమ్మాయ్, ఆనక భోజనానికొస్తా, మా తల్లిగా! (తూలుతూ పరుగెత్తి వెళ్ళిపోతాడు.)

[మాణిక్యాలరావు పెద్దగా నవ్వుతాడు. జవాను వస్తున్నాడేమోనని భయంగా చూస్తాడు.]

అన్న: (కళ్ళు తుడుచుకుంటూ) నవ్వండి! మీ కన్నీ నవ్వులే! ఈ నరకం నేను భరించలేను!

మా: (వెగటుగా) నరకమేముంది? నీకు సంపూర్ణ స్వాతంత్ర్యముంది! పంచభక్ష్య పరమాన్నాలు తినవద్దని ఎవరైనా నిర్బంధించారా? కారెక్కి సినిమాలకు, షికార్లకు పోవద్దని ఎవరైనా అడ్డుపెట్టారా? మనది స్వేచ్ఛారాజ్యం!

[సత్రంజవాను కేకలు దగ్గరగా వినిపిస్తాయి. అన్నపూర్ణ భయంతో లోపలికి వెళ్ళిపోతుంది. మాణిక్యాలరావు మంచంమీద పడుకుని గాఢనిద్ర నటిస్తాడు. జవాను నరసయ్య మొరటుగా కర్ర వూపుతూ ప్రవేశిస్తాడు. "ఏమయ్యోయ్!" అని కేకవేస్తాడు.

మోచేతులవరకు బనీనులాంటి చొక్కా, పైన నువాలు, మోకాళ్ళ వరకు ఎగగట్టిన పంచె — పోలికలు, మనస్తత్వం అంతా పోలీస్ ఆఫీసర్ లాగే వున్నాడు.]

నరసయ్య: (బిగ్గరగా) ఏమంటోయ్! మిమ్మల్నే! (మాణిక్యం

లేవమ్మా. సాంబమూర్తి కబుర్లతో కాలక్షేపం (సూ) నిన్నే నరసయ్యా!
నిద్ర గాదూమరి ఇప్పుడు వాళ్ళొచ్చినప్పుడే అన్ని నిద్ర
లూనూ ..... నేర్చుకున్నావు! నిన్నే నయ్యా,
లేవవేం!

సూ : (తెప్పరిల్లి లేచి ఆవలిస్తూ ముఖం తుడుచు కుంటూ) ఏమిటోయ్ నరసయ్యా! (నవ్వు నటిస్తూ) సత్రంలాంటి మా గిడ్డంగి. నాకు విప్పిస్తే చాలదూ!

నర : (నాటుగా) ఎంతమాసింతే ఏం ప్రయోజనం? మూడు నెల్లనుంచీ పేరజెట్టావ్, ఏదీ? మొన్నరాత్రి జీతం వస్తుందీ, ఇస్తానని గట్టిగా చెప్పి, పత్తా లేకుండా పోయావే!

సూ : అసలెంత ఇవ్వాలసుంటుందేం, లెక్కచూశావా?

నర : అవును, జ్ఞాపకముంటుందా? ఆ నాలుగు సామాన్లూ బైటపడవేసి తాళంవేస్తే అన్ని లెక్కలూ ఒక్కసారి తేలతై—

సూ : నాకు గుర్తు లేదోయ్, ఏదో ఒక వారమన్నా ఆగలేక పోతావా అని. వచ్చిన డబ్బంతా మొన్ననే ఖర్చు పెట్టాను! అలా కేకలేస్తావేం?

నర : ఈ కబుర్లన్నీ నాకు తెలుసు. ముందు డబ్బిస్తే తర్వాత మర్యాదలు చూసుకుందాం! ఏం, నాకు మామూళ్లైనా ఇస్తున్నారా? ఆ పక్కగదిలో ఆయన పది రూపాయల అద్దె, రెండు రూపాయలు మామూలు ఇచ్చాడు. ఊం, ఇవ్వండి! మీ అద్దె ఈ మూడు నెల్లకూ ముప్పై రావాలె!

సూ : అప్పుడే ముప్పై అయిందా?

అన్న : (లోపలినుంచి కోపంగావచ్చి) మొన్న పదిరోజులనాడు ఏడురూపాయలిచ్చానుగా, ముప్పై ఎలా అయింది?

నర : (నిర్లక్ష్యంగా) అది మామూలుకింద జమకట్టాను, అందరూ యిచ్చేదే! మీరేం నామీద దయతలచ కర్లా—

అన్న : నువ్వే మామీద దయతలుస్తావ్ మహా!

నర : (మండిపడుతూ) ఏమిటమ్మోయ్, ఇదేం మీ వూరను కుంటున్నావా? పగలంతా పైపునీళ్లు, రాత్రంతా ఎలక్ట్రిక్ లైట్లు కావాలేం? ఇదేం మన తాతలు కట్టించిందికాదు, తాళంవేస్తే తెలుస్తుంది!

మా : (విసుగుగా) అన్నపూర్ణా! నువ్వు లోపలికెళ్ళు! నీకెందుకీ గొడవలు? నేనున్నానుగా!

అన్న : (వెగటుగా) ఉండకేం! ఉన్నారు!

[మాణిక్యాలరావు పరులఎదుట భార్యనేమీ అనలేక సిగ్గుతో తలవంచుకుంటాడు. నరసయ్య నేదోవిధంగా లొంగతీయక తప్పదని నిర్ణయించుకుంటాడు.]

మా : ఏంచెయ్యమంటావోయ్ నరసయ్యా! ఈ పట్నంలో, ఇంట్లోకూచుంటే డబ్బురాదు, బైటికడుగుపెడితే ఖర్చు! ...ఇక్కడ నువ్వెన్నాళ్ళనుంచి వుంటున్నావ్? (మృదువుగా) ఏమైనా పిల్లలా?

నర : (దుడుకు తగ్గి, సానుభూతి కోరేవాడిలాగ) మెల్లగా అంటారేం బాబూ! ఆరుగురు — ఏడోవాడు సిద్ధంగా వున్నాడు!

మా : చాలాకష్టం — నీ గది మరీ చిన్నది సుమా!

నర : ఎంత ! ఇట్లా రెండంగలు వేస్తే గోడ తగులుతుంది. (రెండంగలదూరంనడిచి మొఖం గోడకు కొట్టుకుంటాడు) ఇల్లంతా గందరగోళం—కోళ్ళగంపలా వుంటుంది! పైగా దానికి జబ్బు ! ఆ జబ్బు బ్రతకనిచ్చేదీగాదు, చావనిచ్చేదీ గాదు !

మా : అబ్బ ! ఒక్కడివీ అంత సంసారం ఈదుకురావడం చాలా కష్టం ! ఒకపక్క పిల్లల గోల, రెండోపక్క సత్రం అజమాయిషీ; అద్దెవసూళ్ళు, లెక్కలూ—అన్నట్టు, ఈ అద్దెవసూళ్ళన్నీ సరిగ్గా జమాఖర్చు వేస్తావా, నోటిగుర్తేనా ?

నర : చదువుంటే ఈ చాకిరీ దేనికి బాబూ, ఏ నౌకరియో, లేకపోతే ఏ ఉద్యోగమో చూసుకోకపోయానా ? ఎవరో మీవంటివారితోనే తీరిక వున్నప్పుడల్లా నాలుగు పద్దులు వ్రాయించుకుంటా !

మా : ఎవరురాస్తే ఏంలే, ఖచ్చితంగా వుండాలిగాని !

నర : అదివుంటే ఇంకేంబాబూ ! పోయినయేడు యాభైరూపాయలు తరుగొచ్చింది, నెలరోజులు నాకు నిద్రపట్టలా—

మా : పాపం ! నీ కొక్కడికీ కష్టమే ! ఈ అవస్థంతా ఎందుకు, ఇక్కడికి తెచ్చిపడెయ్, శుభ్రంగా దేనికది రాసిపారేస్తే పోతుంది !

నర : (ఆశగా) ఆపని చేస్తిరా మీకు పుణ్యముంటుంది !

మా : (అవకాశం దొరికిందని) పుణ్యం నా కెందుకోయ్ ! దమ్మిడీ తేడారాకుండా చూస్తాను......ఇదిగో ! రెణ్ణెల్ల అద్దె కోసెయ్ !...ఈ సత్రంలో అంతా నీమీద కత్తిగట్టేవాళ్ళే—

నర : మొండివాణ్ణి బాబూ! నేను లెక్కచేస్తానా!

మా : అహా, ఎవరికైనా అంతమంది విరోధులుండటం మంచిది కాదోయ్! నీమీాద ఈగవాలకుండా చేసేభారం నాది; రెండునెల్లు అద్దె తగ్గించు!

నర : ఆఁ! ఏదో ఒక నెలకైతే......

మా : (నచ్చజెప్పాలని) కాదులే లెక్కపని చాలా వుంటుంది. జాగ్రతగా చెయ్యొచ్చూ ..నూను, ఈ సంగతి ఎవ్వరితోనూ అనకే, 'ఓస్ ఇంతేనా, నరసయ్య తెలివి' అంటారు!

నర : ఆఁ, అటువంటివాళ్ళని ఎంతమందిని చూశానంటారు!

మా : వద్దు, వద్దు! ఎవరితోనూ అనవద్దు సుమా; మనిద్దరికీ పరువు దక్కదు!

నర : అయితే ఈ ముష్టి ఇప్పించండి!

మా : రెండునెలల అద్దె కోసేశావుగా, ఇక పదేగా రావలసింది! కొన్నాళ్ళాగవోయ్!

నర : (ఆశ్చర్యంగా) ఏమిటంటావోయ్, భలేవారే!

[ బైటనుంచి "మాణిక్యాలరావుగారూ!" అని కాబూలీవాలా పిలుస్తాడు. అందరూ అటు చూస్తారు. కాబూలీ లోపలికి వస్తాడు. వడ్డీవ్యాపారంచేసే కాబూలీ ముసుగ్లో, చేతిలో హంటర్ వూపుకూ వస్తాడు. అతని పోలికలు, మన స్తత్వం అంతా మానేజింగ్ డైరెక్టరులాగే వున్నాడు. ]

కాబూలీ : మాాణిక్యాలరావుగారూ హెవరూ అండి?

మా : (లేచి) నేనే, (గౌరవంగా) కూర్చోండి!

కా : (చేతిలోవున్న నోట్‌బుక్‌లో లెక్కచూస్తూ) ఏమండీ,

హెన్నిసార్లు వచ్చినా కనపడరు? ఇదీ సత్రం మాకీ ప్రాణాల్ తోడేస్తుండాది!

మా : (నవ్వు తెచ్చుకుని) ఏమండీ పాప సత్రమేం చేసింది?

కా : మీకంతా ఇదే వరస! (ఈలోపల నరసయ్య గదిమూలలన్నీ కలయచూస్తూ కర్రతో బూజు దులుపుతున్నాడు. అతన్ని చూసి) హెవడువీడు? ఉల్లూకా బచ్చా!

మా : అతన్ని తెలియనివాడు ఈ చుట్టుపక్కల వుండరే! ఈ సత్రానికి జవాను!

కా : ఇక్కడా ఎందుకు నిలబడతాడూ వీడూ? (జవానుతో) హేయ్. నీకేం పనిలేదూ?

నర : (నిర్లక్ష్యంగా) ఏం, చూస్తే అరిగిపోతావా?

కా : వీణ్ణి పంపివేయండి. (లెక్క చూసుకుంటున్నాడు.)

[ మాణిక్యాలరావు జవానుతో వెళ్లమని భయపడుతూనే సైగ చేస్తాడు. అతను నిర్లక్ష్యంగా ముఖంపూపుతూ అక్కడే తిరుగుతూ వుంటాడు. ]

కా : అన్నపూర్ణ అంటే మీకీ...

మా : అవునండి... మొన్ననే లెక్కచూసి వుంగరం తీసుకోవాలనుకున్నాం... కాని—

కా : తీసుకోండి, తెచ్చాం వుంగరం! (అన్నపూర్ణ వచ్చి భయంగా, ఆశగా చూస్తున్నది.)

మా : మొన్న వచ్చినడబ్బు ఖర్చయిపోయిందీ, ఈసారి తప్పకుండా, జీతం రాగానే, మరిచిపోకుండా...

కా : (పరికించి చూసి) మీకీ నౌకరీ చేస్తుండార్? ఎక్కడ? అడ్రసు చెప్పండి ఒకటో డేట్‌కి అక్కడికే వస్తాం!

సూ : (తడబడుతూ) అదే...ఆ వీధిలేదూ అంటే మైన్‌రోడ్డు మీదనే—

కా : హేమిటీ వ్యాపారం?

సూ : (అబద్ధం సమర్థించుకోలేక, ఇంకా కంగారుపడుతూ) అదే ...పెద్ద వ్యాపారంలెండి...మాది చాలా పెద్ద ఆఫీసు... అక్కడసెందుకులెండి!

కా : (గ్రహించి, నవ్వుతూ) మర్చిపోయార్? (కటువుగా) మీదీ ఎక్కౌంట్ సెటిల్ చెయ్యండి!

అన్న : కొంతకాలం ఆగండి!

కా : మాదీ బిజినెస్ మీకోసం పెట్టామా?

మా : వచ్చే నెలలో ఏదోవిధంగా......

కా : ఇక రెండు మాసాలైతే వడ్డీకి మీ వుంగరం బరాబర్... మీరు కొత్తది కొనుక్కోవచ్చు! కావాలంటే ఇప్పుడు తీసుకోండి!

మా : (దిక్కుతోచక) ప్రస్తుతం మా దగ్గర...రేపు సే నొస్తా లెండి!

కా : మాకీ నమ్మకమేంటి, ఇప్పుడే తేల్చేయ్!

అన్న : (దీనంగా) ఒక్కవారం ఆగండి...అది మా పెండ్లినాడు పెటిన వుంగరం—

కా : (కటువుగా) దాన్కి మేమేం చేస్తామమ్మా! బంగారు నగలు పెండ్లికీ కాకపోతే చావుకూ చేయించుకుంటారా?

అన్న : (అతిదీనంగా) ఒక్క వారంచాలు!...

మా : (ఆదుర్దాగా) వీలైతే రేపే, తప్పకుండా వచ్చితీరుతాను నేను!

శా : (ఆలస్యానికి విసుగుపడుతూ) బస్, బస్! హీలాంటి మాటలు అంతా అంటుంటార్! మేం ఆగలేం! ఇప్పుడైనా మీ బాకీసొమ్మిచ్చి లెక్క ఫైసల్ చెయ్యండి! లేకపోతే ...హెక్కువ ధరచేసే నగలేమైనా పెట్టండి!

అన్న : ఇక మా దగ్గర ఏమీ—

మూ : (చేయెత్తి భార్యమాట ఆపుతూ) అంతకంటె విలువైన నగ లిక్కడికి తీసుకురాలేదండి...

శా : ఏదైనా ఛోటాసామాన్ ఇవ్వండీ! చిన్నది? (ఆమెవంక చూస్తూ) గాజులు, ముక్కుపుడక (ఆమె వొంటిమీద సొమ్ములు లేవని గ్రహించి) ఓ, అదా!

[భార్యాభర్తలు నిర్విణ్ణులై నిలబడతారు. అన్నపూర్ణ దుఃఖం ఆపుకోలేక సిగ్గుపడి లోపలికి వెళ్ళిపోతుంది.]

మూ : ఆ విధంగా చిన్న సొమ్ములుకూడా పెడితే మావాళ్ళు ఎక్కడికైనా వెళ్ళాలంటే నలుగురిలో బాగుండదని...

[మాటలు ఎంత యీడ్చిచెప్పినా తనసిగ్గు దాచుకోలేక ఆపేస్తాడు.]

శా : (అంతా గ్రహించి, ఆశవదులుకుని) ఫాయిదానై! ఇదిగో వుంగరం! (బైటికి తీస్తాడు) మీదేనా?

[అన్నపూర్ణ చరచర బైటికివచ్చి, ఒకసారి చూసుకుందామని అందుకోబోతుంది.]

(ఆమె కివ్వకుండా) ఇది మీదికాదు అండీ? (రుమాలతో తుడిచి జేబులో పెట్టేసుకుంటాడు. ఆమె నిస్పృహతో వెనకడుగు వేస్తుంది. అతను జేబులోనుంచి ఒక కాగితం తీసి) దీనికి డబ్బైరూపాయలు కిమ్మత్ కట్టాం! మీరు ఇరవై ఐదు రూపాయలకు తాకట్టు పెట్టార్! (వేళ్ళ

లెక్కించి) ఇప్పుడు వడ్డీ. అసలు ఫాయిదాలు, రెండు రూపాయలు మీకోసం తిరిగినందుకు అంతాపోతే మీకు ముప్పైరూపాయల పదమూడణాలు వస్తై!

మా : (ఆశ్చర్యంతో) వడ్డీ ఎంత?

కా : అదినా! బస్!

అన్న : (కోపంగా) మేం తీసుకున్న గానికంటె మీ వడ్డీయే ఎక్కువైందే! ఏమిటీ ఘోరం! ఎక్కడా లేదే!

మా : (కోపంగా) ఇంత వడ్డీ ఎక్కడాలేదు. అలాఅయితే వుంగరమే అమ్మేసేవాళ్ళం!

[నరసయ్య ఒకపక్కకు నిలబడి చోద్యం చూస్తుంటాడు.]

కా : అమ్మితే మాకీ వద్దన్నామా! (కోపంగా) మేం లక్షలతో బిజినెస్ చేస్తామయ్యా!

మా : మీ లక్షలూ, మీ కోట్లూ మా కక్కరలేదు. మాకు న్యాయంగా ఎంతరావాలో ఇచ్చిపొండి!

కా : (మండిపడుతూ) న్యాయంగా నీకంతే వస్తుంది! ఇదిగో నువ్విచ్చిన రసీదు చూస్కో! (రసీదు వున్నట్టు జేబు చూపిస్తాడు, కాని బైటకి తియ్యడు) దానిమీద మీ నిషాన్ వుంది!

అన్న : ఏం సంతకాలు, మోసంచేసి......

కా : హుంగరం కావాలని మేమన్నా అన్నామా!

మా : రెండు రోజుల్లోనే తీసుకోవచ్చనుకున్నాం.

కా : ఇన్నిమాసాలు మేం ఆగమన్నాం! (నవ్వుతూ) నువ్వింకా నేర్చుకోవాలి భాయ్, వ్యాపారంలో నిజాయితీ వుండాలి!

మా : (కోపంహెచ్చి) అపలుకంటె వడ్డీ ఎక్కువేసుకుని మాకు నిజాయితీ నేర్పవస్తున్నావ్! పో. నీ డబ్బు వద్దు, నీ వుంగరం వద్దు, వెళ్ళిపో! దొరికినవాళ్ళనల్లా దోపిడిచేసే దొంగల ముఠాలు! నీతులు చెప్పొస్తున్నాడు!

కా : (నిర్లక్ష్యంగా) ఇదిగో. తీసుకో! (మాకు పది రూపాయలనోట్లు, పదమూడణాలు అందించబోతాడు.)

అన్న : (కోపం పట్టలేక) వద్దు! (భర్తతో) తీసుకోకండి! (కాబూలీతో) మాకు వుంగరమే కావాలి! ఎంతో మోజుగా చేయించుకుని—

మా : ఆ డబ్బు మేం ముట్టుకోం! మా ఉంగరం ఇచ్చేసెయ్, తర్వాత నీ పాతిక చెల్లిస్తాం!

కా : (కోపంతో) హేంమిటీ అయ్యా! జంటిల్‌మన్ అనుకున్నానే! ఇదేం బద్మాషీకాదు...వ్యాపారం!

మా : మనిషి లక్షణం డబ్బుదగ్గర బయటపడుతుంది!

కా : (నిర్లక్ష్యంగా) డబ్బు హెక్కువైతే మానెయ్!

[డబ్బు తా కింద విసిరేసి చరచరా వెళ్ళిపోతాడు. భార్యాభర్తలు నిర్ఘాంతపోతారు. ఇంతసేవు చోద్యం చూస్తున్న నరసయ్య వెంటనే వచ్చి మూడునోట్లూ ఏరుకుంటున్నాడు.]

మా : (ఆదుర్దాగా) నరసయ్యా. నీకు తర్వాతిస్తా! వద్దు, ఇప్పుడుకాదు, నామాట విను! (వెళ్ళి అతని చేతులు పట్టుకోబోతాడు.)

నర : (చేతులు విదిలించి, డబ్బు బొడ్డులో పెట్టుకుంటూ) మీ దగ్గర డబ్బుందన్నమాట! లేకపోతె వాడిస్తానంటే వొద్దని పోట్లాడతారా!

అన్న : నరసయ్యా! ఆ డబ్బిస్తావా? ఒక్క వారంరోజులాగు! దీనితో ఏదో ఒక దుకాణంపెట్టి——

నర : చాలా బాగుంది! మీరు దుకాణాలుపెట్టి, లాభాలు తీసి అప్పుడు నా కిస్తారా!

మా : (అతను వెళ్ళిపోతుంటే) నరసయ్యా, ఆగు, ఆగు! రెండు నెల్ల అద్దెపోతే పదేగా నీకు రావలసింది?

నర : ఏమమ్మోయ్, నాకూ ప్రపంచ జ్ఞానముంది! (తన తలలో వేళ్లుదూర్చి జుట్టుచూపిస్తూ) మీవంటి వాళ్ళను ఇంతమందిని చూశాను! (వెళ్ళిపోతాడు)

కృష్ణ : (త్వరగా లోపలికి వచ్చి) అమ్మా! అమ్మా! ఎంత యిచ్చాడే! (నేలమీద చిల్లరడబ్బులు చూసి ఏరు తున్నాడు. భార్యాభర్తలు మాట్లాడరు. అతను లెక్క పెట్టి) పదమూడణాలు! నాక్కావాలి నాన్నా! ఏం నాన్నా! నేను తీసుకుంటానమ్మా!

[తల్లిదండ్రులవంక పరిశీలనగా చూస్తున్నాడు. కాని, వారిరు వురూ యీ డబ్బెవరు తీసుకోవాలా అని, ఒకరినొకరు శత్రు వుల్లాగ చూసుకుంటున్నారు. కృష్ణ నెమ్మదిగా బైటికి తప్పుకోబోతున్నాడు.]

మా : (కటువుగా) కృష్ణా! ఇలారా!

అన్న : (కోపంగా) ఆ డబ్బు నాకివ్వు!

మా : (చెయ్యిసాచి) ఏదీ, ఇటివ్వు!

అన్న : (ఆదుర్దాగా) రా ఏంరా! నిన్నుగదూ పిలిచేది! (కృష్ణ ఏమీ చెయ్యలేక నిలబడతాడు.)

మూ : [అన్నపూర్ణతో, క్రూరంగా] నీ వుద్దేశమేమిటి? నేను మనిషిని కానూ!

అన్న : [నిరసనగా] ఎందుకు కారు?

మూ : [ఆగ్రహంతో] నే నున్నాను! ఈ ఇంటికి యజమానిని నేను!

అన్న : [ఇంకా నిరసనగా] ఎప్పటినుంచి?

మూ : [ఆపుకోలేక, చేయెత్తి కొట్టబోతూ] నీకు బుద్ధిలేదూ?

[హఠాత్తుగా సీతారామయ్య కూలుతూ ప్రవేశిస్తాడు.]

సీతా : (ఆశ్చర్యంతో) ఏమిటిదీ! మీ భార్యాభర్తల ఆలోచనలకు అంతూ పొంతూ లేదాయేం? అమ్మాయ్! అదృష్టమంటే నీది; మొగుడు క్షణం నిన్నువదిలిపోలేడుగదా! (హాస్యంతో) ఇంత ప్రేమైతే ఎట్లాగయ్యా? (అన్నపూర్ణతో) వంటయిందా?

మూ : (అవకాశం దొరికిందని) కృష్ణా! పోయిరా, అక్కడ పత్రికల షాపులో పజిల్స్, క్రాస్‌వర్డ్స్ పజిల్స్ పత్రిక అని చెప్పు! మువ్వానలా అవుతుంది! (అన్నపూర్ణ నివ్వెరపోతుంది.) కొత్త సంచిక! త్వరగా తీసుకురా!

అన్న : (దీనంగా) కృష్ణా! మిగిలిన అణాపెట్టి అరటిపండ్లు తీసుకురా నాయనా! (కృష్ణ వెళ్ళిపోతాడు.)

సీతా : (నవ్వుతూ) అరటిపండ్లు తింటున్నారా? జబ్బు చేస్తుందమ్మాయ్!—ఇంత లేతవయసులో ఆరోగ్యం పాడుచేసుకుంటే యెలాగమ్మాయ్!

అన్న : (వెగటుగా) ఆరోగ్యంగావుండి అనుభవిస్తున్నాంగా!

మా : (వెర్రిగా, వెగటుగా నవ్వుతూ) అనుభవిస్తున్నామయ్యా సీతారామయ్యా !

సీతా : (ఆశ్చర్యంతో) మీ కన్నీ నవ్వులే ! అందుకే మీ ఇంటికి వస్తే నా దిగుళ్ళన్నీ మరిచిపోతాను !

మా : (ఇంకా వెర్రిగా) కొన్నాళ్ళు నవ్వడానికి ఓపికకూడా లేక ఏడ్చేవాళ్ళం; ఇప్పుడు ఏడ్వడానికి ధైర్యంకూడా లేక నవ్వుతున్నాం !

సీతా : (అతనివంక చిత్రంగా చూసి) సరేగానీ....అమ్మాయ్, పద, నా కన్నం పెట్టవూ ! నేనంత తినగూడని వాణ్ణా ?

మా : (మరీ పెద్దగా, వెర్రిగా నవ్వుతూ) అడుగూ! అడగవయ్యా! గట్టిగా అడుగు !...వొళ్ళు బద్ధకం మనిషి ! వొళ్ళొంగడం లేదు ! వంట మానేసింది ! వొళ్ళు బద్ధకంవల్ల వారంరోజుల్నుంచి తిండి మానేశాం !

[అన్నపూర్ణ దుఃఖం ఆపుకోలేక పెద్దగా ఏడుస్తూ, కొంగు ముఖానికి అడ్డుపెట్టుకుని లోపలికి పోతుంది.

మాణిక్యాలరావు వెగటుగా నవ్వుతూ, హఠాత్తుగా ఆపేసి ముఖం చేతులలో మూసుకుని కుర్చీలో కూలబడతాడు.

సీతారామయ్య ఇదేమీ అర్థంగాక విచిత్రంగా చూస్తుంటాడు.]

[తెర జారుతుంది]

# స్వాప్నిక జీవితం:

## తృతీయాంకము

[ మద్రాసు నగరంలోనే ఒక మూరుమూలవున్న చౌకబారు హోటలు. ఒక గదిలో వున్న టేబిల్ చుట్టూ నాలుగు కుర్చీలు, గోడలమీద నాయకుల, దేవుళ్ల, సినిమా చిత్రాలు. ఒకచోట లక్ష్మీదేవి చిత్రం కింద ప్రమిద వెలుగుతూ వుంటుంది.

సమయం సాయంత్రం:

నారాయణరావు, వెంకట్రావు ఇద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకుంటు న్నారు. పోలికల్లోనూ, మనస్తత్వంలోనూ నారాయణరావు మానే జింగ్ డైరెక్టరులాగ, వెంకట్రావు పోలీస్ ఆఫీసర్‌లాగ వున్నారు. వారి దుస్తులనుబట్టి చాలా గొప్పవారో, 'పెద్ద కాడీలో తేల్చుకో లేము.

ఒకమూల హోటల్ సైటరు బీడీ కాలుస్తూ నిలబడి ప్రపంచాన్ని మరిచిపోయాడు. ఇద్దరు మిత్రులు కాఫీతాగుతూ, సిగరెట్లు కాల్చు తున్నారు. ]

నారా: (హుషారుగా) వెంకట్రావ్! నా వాదమంతా ఒక్క ముక్కలో చెప్తా విను! పులికోరలు పాముకోరలకంటె పెద్దవేగాని, పాము కాటువేస్తే ఆ విషం యెక్కి మనిషి అమాంతం చనిపోతాడు. చనిపోయి తీరాలి! అంతే నారాయణరావ్ మాటంటే!

వెంక: నారాయణరావ్! ఐతే పులికోరలు తగిలినవాళ్ళు బ్రతికి బైటపడుతున్నారా యేం! నీది పొరపాటోయ్!

నారా: (అసహనంతో) వెంకట్రావ్! నా పాయింట్ ఇది! పులి కోరలకంటె పాముకోరలు పదునుగా వుంటాయి, విషం

వుంటుంది! అందుచేత పులికంటె పాము చాలా క్రూర మైనది! (బల్లగుద్దుతూ) ఇది ముమ్మాటికీ నిజం! నువ్వొప్పుకుని తీరాలి!

వెంక : నే నొప్పుకోనూ, మనకీ వాదం తేలదు! (బైటికి చూసి, నవ్వుతూ) మాణిక్యాం వస్తున్నాడోయ్! (బైటనుంచి హోటల్ యజమాని కేకలు వినిపిస్తాయి.)

నారా : (వెటకారంగా) పూర్ ఫెలో! రెండేళ్ళు జెయిల్లోపడ్డా ఒక్క దమ్మిడీ దక్కలేదు!

వెంక : అందుకే, సిలబెట్టి దగాయిస్తున్నాడు హోటల్ ప్రొప్రయిటర్! చదువుకున్నాడు; కాలం కర్మం కలిసిరాక లైఫంతా ఖోల్తాకొట్టింది!

[మాణిక్యాలరావు ప్రవేశిస్తాడు. అతినీరసంగా, దీనంగా వుంటాడు. చినిగిన చొక్కామీద ఉత్తరీయం భద్రంగా కప్పుకుంటున్నాడు.]

నారా : (హేళనగా) హలో, మిస్టర్ రావ్! హౌడు యు డూ! ఇప్పుడు మాకొక పెద్ద ప్రాబ్లెమ్ వచ్చిందోయ్!

వెంక : (కూర్చోమని చోటుచూపిస్తూ) కూర్చో. చెబుతాం!

మా : (దీనంగా, పూడిన గొంతులో) నా ప్రాబ్లమ్సు నాకు చాలకనా? వద్దులే!

వెంక : కాదు నువ్వు వినాలి, జడ్జిమెంటు చెప్పాలి! ఇదిగో, ఎందులో విషమెక్కువ? పాముకోరల్లోనా, పులి కోరల్లోనా? ఏ గాయానికి త్వరగా మనిషి చనిపోతాడు? నువ్ చెప్పు!

మా : (వినిపించుకోకుండా వైటర్‌ను పిలుస్తాడు. వైటర్ వచ్చి, వంగి వింటాడు.) ఒక కప్పు కాఫీ! (వైటర్ విని, నవ్వి, వెళ్ళి

యథాస్థానంలో నిలబడతాడు. నారాయణరావు, వెంక
ట్రావు ఇతని దుస్థితికి పగలబడి నవ్వుతాడు. మాణిక్యాల
రావు అతన్ని ప్రశ్నించినట్టు చూస్తాడు.) వెళ్ళవేం!

వైటర్ : (సీరియస్‌గా దగ్గరకువచ్చి, నిర్లక్ష్యంగా) మీ ఖాతాలో
ఏమీ ఇవ్వడానికి వీల్లేదు!

మా : ఏ, ఎప్పట్నుంచి? వెళ్ళి కాఫీ తీసుకురా, పో!

వైటర్ : ప్రొప్రయిటర్ నిన్ననే చెప్పారు!

[ మాణిక్యం అభిమానం వచ్చి వాళ్ళను చూడలేక తల
దించుకుంటాడు. మిత్రులిద్దరూ పగలబడి నవ్వుతారు. ]

నారా : కమాన్ మిస్టర్ రావ్! ఇదిగో, నా దగ్గర డబ్బుంది,
రా! (ఐదువందల విలువ నోట్లు చూపిస్తాడు.) పామే
క్రూరమైనదని తెల్సేయ్! నీ క్కావలిస్తే పాతిక రూపా
యలు తీసుకో!

వెంక : కాదు, కాదు. పులికోరలు! ఎంత కావాలంటే అంత
యిస్తా!

మా : (ద్వేషం పట్టలేక, లేచి నిలబడి) మనిషి! అన్నిటికంటె
మనిషిగుండెలో విషం ఎక్కువ! అడివి మృగాలకంటె
క్రూరమైన జంతువు మనిషి! మనిషి! మనిషి! (పెద్దగా
కేకలు పెడతాడు. వాళ్ళిద్దరూ పెద్దగా నవ్వుతారు.)

మా : నువ్వు! – నువ్వు! (హోటల్ యజమానిని ఉద్దేశించి,
బైటికి వేలుచూపుతూ) అడుగో అతను!

యజ : (బయటనుంచి కేకవేస్తూ) మాణిక్యం! ఇది నీ యిల్లు
కాదు, హోటలు! ఇక్కడ కేకలేస్తే బజారులోకి
గెంటేస్తా!

[ మాణిక్యాలరావు నిస్సారంగా కూర్చుంటాడు. ]

వెంక : (దయతలిచి) కాఫీ కావాలా ?—వైటర్, నా ఎకౌంట్‌లో తీసుకురా, పో !

నారా : (ఆశ్చర్యంతో వెంకట్రావును చూసి, తానుగూడా దయ కనబరచాలని సిగరెట్ పెట్టె మాణిక్యంముందు పెట్టి) తీసుకో ! సిగరెట్ కాల్చి ఎన్నాళ్లైంది ?

[మాణిక్యాలరావు మాట్లాడడు. సిగరెట్ పెట్టె చేతితో పట్టుకుని చూస్తాడు. తీసుకోడు. అవసరం వుంది; కాని అభిమానం అడ్డు వస్తుంది. నారాయణవంక చూస్తాడు ]

మా : (మెల్లగా) నారాయణరావ్ ! నీకు కొంత డబ్బివ్వాలను కుంటాను !

నారా : (నవ్వుతూ) ఓఁ, ఎప్పుడూ అడగడమేగాని ఇవ్వడం లేదుగా ! ఇస్తే చాలా బాకీ తేలతావ్ !

మా : (ప్రాధేయపడుతూ) చూడు, రెండు రూపాయలు కావా లోయ్ ! పజిల్ పంపించాలి !

నారా : అదా సంగతి ! ఈ ఆరు నెలల్లో ఎంత ఖర్చుపెట్టావ్ ? మొత్తం అయిదువంద లయిందా ?

[ మాణిక్యం తలవూపుతాడు ]

వెంక : (వెటకారంగా) మరి ప్రైజేదోయ్ ?

నారా : ఆఁ, నీ పేరు అచ్చిరానడంలేదోయ్, నా పేరుతో పంప రాదూ ? డబ్బిస్తానులే !

మా : (కోపంతో) అక్కర్లేదు !

వెంక : ఫర్వాలేదు, తీసుకో బ్రదర్ ! రాత్రి చీట్లపేకలో గెలి చాడు ! ఊరికే వచ్చిన సొమ్మేగా !

సూ : (ఆశ్చర్యంతో) ఎంత?

వెంక : ఆఁ, నావి రెండువందలు పోయింది! అతను ఎనిమిది వందలు గెలిచాడు!

సూ : ఎనిమిది వందలా! ఒక్క రాత్రిలో?

నారా : (నిర్లక్ష్యంగా) టూ అవర్స్; రెండు గంటలు!

వెంక : అదీ అదృష్టమంటే!

సూ : (ఉద్రేకంతో) మీ రిద్దరూ పెద్దమనుష్యులేగదూ! ప్రతి వాళ్ళూ మిమ్మల్ని గౌరవిస్తారుగదూ! హోటల్ యజమానికి మీరంటే భయపడతాడుగదూ! మీరు చేసేది దొంగతనం కాదుగా!

నారా : (కోపంతో బల్లగుద్ది) మాణిక్యం! మెత్తనివాడి వనుకుంటే నెత్తికెక్కేట్లున్నావే! ఇక్కడ నోటికొచ్చినట్టు మాట్లాడితే ఫలితం అనుభవిస్తావ్, తెలిసిందా?

వెంక : నీకంటె ఎవ్వరూ తీసిపోలేదు!

సూ : (అందుకుని) అదే! సరిగ్గా అదే నే నంటున్నది; నాకంటె ఎవరు తీసిపోయారు అని! నేనొక విధంగా చేసి అప్రతిష్ఠపాలయ్యాను, అవమానాల పాలయ్యాను! మీరు మరొక విధంగాచేసి జల్సాగా బ్రతుకుతున్నారు! (వెయిటర్ కాఫీ తెస్తాడు. మాణిక్యం విరసంగా కాఫీ తీసుకుంటూ) నామీద మండిపడతారేం? నాకు తోచింది నేను చెప్పాను!

నారా : మిస్టర్! తోచినవన్నీ చెయ్యడంవల్లనే రెండేళ్ళు తీసుకున్నావ్! ఇకనైనా జాగ్రతగావుంటే మంచిది!

వెంక : (డాబుగా) ఇప్పటికైనా లౌకికం తెలుసుకోలేకపోతే నువ్వు గెటౌన్ కాలేవుఫాయ్ !

నారా : (దర్జాగా) మేముకాబట్టి పావం పోనీలే, అని సహిస్తున్నాం !

వెంక : (ఇంకా దర్జాగా) మరొకరైతే నీ రక్తం కళ్ళజూస్తారు !

[మాణిక్యాలరావు ఇద్దరివంక చూస్తాడు. ఏంచెయ్యాలో తోచదు.]

మా : (నారాయణరావుతో) రెండురూపాయలివ్వరోయ్ ! అర్జెంటుగా పజిల్ పంపించాలి ! ఇవాళే ఆఖరు రోజు !

వెం.క : (ఎగతాళిగా) ఇవ్వరోయ్ పావం !

నారా : (నవ్వుతూ) చూస్తాం, ఆలోచిస్తాం !

[మాణిక్యాలరావు బైట ఎవరికోసమో భయంగా చూస్తున్నాడు.]

నారా : (హేళనగా) ఏం, భయపడుతున్నావ్, పోలీసులు కాదులే !

వెంక : అతనికేం భయం, అన్నిటికీ తెగించినవాడికి !

[వైటర్ బైటికి వెళ్ళి అన్నపూర్ణతోసహా తిరిగివస్తాడు. ఆమె టెలిగ్రాం ఒకటి చేతితో పట్టుకుని, ఆదుర్దాగా లోపలికి వస్తుంది. మాణిక్యం కంగారుగా చూస్తాడు.]

అన్న : ఈ టెలిగ్రాం చూడండి, నాకేదో భయంగా వుంది, ఎక్కడనుంచి వచ్చిందో ?

[మాణిక్యాలరావు అందుకుని నిర్లక్ష్యంగా జేబులో పెట్టుకుంటాడు. అన్నపూర్ణ కూర్చుంటుంది.]

అన్న : కాఫీ తీసుకుందామా ?

[మాణిక్యం విచారంగా ఆమెవంక చూస్తాడు. మిత్రులిద్దరూ లేచి వెళ్ళబోతున్నారు. మాణిక్యంలేచి, తాపీగా ఒక మూలకువచ్చి నిలబడి. టెలిగ్రాం చించి చదువుతాడు.

అతని వదనం హఠాత్తుగా స్పృహ తప్పి పడిపోయేటంతగా పాలిపోతుంది. పెదవులు వణుకుతాయి. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. వెంటనే అతని ముఖం క్రోధంతో ఎర్రబడుతుంది. ఎవరిమైనో కసి తీర్చుకోవాలన్నట్టు ఉద్రేకంతో చూస్తాడు.]

మా : (పెద్దగా కేకపెడుతూ) ఇదిగో! వచ్చింది! ఇదిగో! విన్నారా! మన కష్టాలకు, మన ఆశలకు ఫలితం! పెద్ద బహుమానం! విన్నారా! ఇదే ఫస్ట్ ప్రైజ్! ఫస్ట్ ప్రైజ్!

[అన్నపూర్ణ త్వరగా అతని దగ్గరకొస్తుంది. అతను టెలిగ్రాం జేబులో పెట్టుకుంటాడు. తూలి పడబోతూ, ఆమె చెయ్యి ఆసరాతో వెళ్ళి కుర్చీమీద కూర్చుంటాడు. ఆమె కంగారుగా అతన్ని పరిశీలిస్తుంది. మిత్రులిద్దరూ అతని కేకలు విని బైటికి వెళ్ళకుండానే తిరిగి వస్తారు.]

అన్న : (ఆదుర్దాగా) ఏమిటి? అలా వున్నారేం? చూడండి!

నారా : (లేని ఆప్యాయత తెచ్చిపెట్టుకుని) వెయిటర్! చూస్తావేం! ఐస్ వాటర్ తీసుకురా! వెళ్ళు!

వెంక : (త్వరపడుతూ) రెండు కూల్ డ్రింక్స్ కూడా!

[ప్రైజ్ వచ్చిందని వినగానే వాళ్ళతత్వం పూర్తిగా మారిపోతుంది. మాణిక్యం కొద్దిగా తెప్పరిల్లుతాడు.]

నారా : ఇప్పుడెలావుంది?

వెంక : హఠాత్తుగా తెలియడంవల్ల షాక్ ఇచ్చింది!

అన్న : (భర్తముఖం పైకెత్తుతూ) లేవండి! కూల్ డ్రింక్స్ తెస్తున్నాడు. (మాణిక్యాలరావు తెప్పరిల్లుకుంటున్నాడు.)

మా : (ఆశ్చర్యంగా) కూల్ డ్రింక్స్! ఎవరికి? నాకా!

వెంక : (ప్రేమ నటిస్తూ) మీరాకేనండి! కొంచెం చల్లని పానీయం పుచ్చుకుంటే ఉద్రేకం తగ్గుతుంది.

నారా : (ఆప్యాయంగా, ఇంకా ఏమైనా కావాలా?

[మాణిక్యాలరావు ముఖంలో ఏదో ఆలోచన గోచరిస్తుంది. ఏదో నిశ్చయం మనస్సులో ఏర్పడుతోంది. తనను తానే 'భేష్' అనుకున్నట్టు తల వూపుతాడు ]

మా : (చిరునవ్వుతో) నాకు తెలుసు! నాకు తెలుసు!

వెంక : ఏమిటండీ?

నారా : (వెంకట్రావును ఏహ్యంగా చూస్తూ) అంటే?

వెంక : (నారాయణతో) ఏం అంటే?

నారా : (ఆలోచించి, తనుగుండా) మాణిక్యాలరావుగారూ! ఏమిటండీ? నాకే సంతోషంగా వుంటే!......

మా : (నిర్లక్ష్యంగా) నాకు కూల్‌డ్రింక్సు అక్కర్లేదు!

వెంక : పోనీ కాఫీ తీసుకోండి! — వెయిటర్!

మా : కాఫీయా? ఛీ! (నారాయణతో) ఓవల్టిన్ తెప్పించు!

[వైటర్ వెళ్ళవచ్చునా, కూడదా అని తటపటాయిస్తున్నాడు. యజమాని లోపలికి వచ్చాడు. సిల్కు లాల్చీ, ధోవతి, టోపీ ధరించాడు. పోలికలు, మనస్తత్వం ఇంకా హెడ్‌గుమాస్తా ఆంజనేయులులాగే వున్నాడు. అతని ధోరణికూడా మారింది.]

యజ : వెయిటర్! ఏంకావాలో కనుక్కుని తీసుకురారా! ఏమిటా నిలబడటం విగ్రహంలాగ! నిన్నెందుకు పెట్టానిక్కడ?

వైట : ఎవరి ఎకౌంట్‌లో?

యజ : (గట్టిగా) నీ మొఖం! (మాణిక్యాన్ని చూపిస్తూ) వారి ఎకౌంట్‌లోనే! (వైటర్ వెళ్ళిపోతాడు. మాణిక్యంతో)

టిఫిన్ ఏమైనా తెప్పించమంటారా? (అన్నపూర్ణతో) ఏమండీ, మీకుకూడా!

మా : ఛీ! ఈ నూనెవసుకులు నా కక్కర లేదు!

యజ : పోనీ జహాంగీర్లు, మైసూర్ పాక్ (అన్నపూర్ణతో) తీసుకోండి, ఫర్వాలేదు!

అన్న : చూడండి! ఎవరినైనా పంపి సత్రంలో మా కృష్ణ వుంటాడు పిలిపించండి!

వెంక : ఎందుకు, నేనే వెళ్ళివస్తాను!

మా : (ఆజ్ఞాపిస్తూ) త్వరగా రావాలి!

వెంక : (విధేయుడుగా) తక్షణం! (వెళ్ళిపోతాడు.)

మా : (నిర్లక్ష్యంగా నారాయణతో) థాంక్స్! మిమ్మల్ని మరిచిపోను! (యజమానితో) మిమ్మల్నికూడా!

యజ : (నారాయణతో పెద్దగా) మన మాణిక్యంగా రెలాగైనా పెద్దబుర్ర!

నారా : ఓ! నాకు పరిచయమైన — స్నేహితమైన నెక్స్ట్ మినిట్ నుంచి తెలుసు, ఎప్పుడో ప్రైజ్ కొట్టేస్తాడని! అసలప్పుడే అభినందనాలు తెలియజెయ్యాలనుకున్నా!

మా : (హుందాగా, నవ్వుతూ) అవును! నువ్వనుకుంటావ్! ఇప్పుడు తెలియజెయ్యండి మీ అభినందనాలన్నీ!

[ వైటర్ స్వీట్స్ మొదలైనవి తెస్తాడు. ]

అన్న : (ప్లేట్లు సర్దుతూ) ఒక కుర్చీ వెయ్యండి, మా కృష్ణ వస్తాడు!

మా : (యజమానితో) మీరు తీసుకురండి!

యజ : ఓ, ఎవరు తెస్తే ఏం? (వెళతాడు)

మా : నారాయణరావ్ !

నారా : (ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ) ఏమండీ ?

మా : హోటల్ మార్చేస్తున్నా !

నారా : (ఆదుర్దాగా) ఏం ? ఎక్కడికి వెళతారు ?

మా : ఏదైనా పెద్ద హోటల్లోదిగి, హాయిగా భవిష్యత్తును గురించి ఆలోచించాలి !

నారా : [నవ్వుతూ] నేనుకూడా వస్తా !

మా : [అతని ప్రవర్తన గమనిస్తూ] నువ్వెందుకోయ్, నువ్వేం చేస్తావ్ ?

నారా : మీకు సహాయం చేస్తా ! అప్పుడే మరిచిపోయారా ? ఏదైనా బిజినెస్ చేస్తే నాతో సంప్రదిస్తానని——

మా : ఎలాగైనా ముందింకో హోటలుకెళ్ళాలి !

[ యజమాని కుర్చీపట్టుకుని లోపలికి వస్తాడు. ]

నారా : [యజమానికి సైగచేస్తూ] మన రావుగారు బసమార్చేస్తామంటున్నారు. ఇక్కడ అంత వసతిగా వుండదేమోనని వారి ఉద్దేశం !

యజ : [ఆదుర్దాగా] ఎందుకు ! ఏం కావాలో చెప్పండి ? అన్నీ ఒక్కక్షణంలో ఏర్పాటుచేస్తాను ! సత్రం ఇక్కడేగా ! ఆ సామాన్లన్నీ తెప్పించి సైగదిలో పెట్టించనా ?

మా : ఏం అన్నపూర్ణా ? ఈ హోటల్లో మనవంటి వాళ్ళకు మర్యాదగా వుంటుందా ? ఇక్కడంతా జూదగాళ్లు, దగాకోర్లు, రౌడీలు——

[ నారాయణరావు కోపం అణచుకుంటాడు. ]

యజ : [కోపంగా] మన హోటల్ కేమండీ? దీనికి గవర్నమెంట్ సర్టిఫికెట్ వుంది ! మంత్రివర్గం మారినప్పుడల్లా మనమేగా టీపార్టీ యిచ్చేది !

అన్న : చూడండి ! మేడమీద మంచిగదులేమైనా వున్నాయా? బాగా గాలి, వెలుతురు వచ్చేగది కావాలి !

యజ : ఓ, అలాగే ! మీ యిష్టం ! పెద్ద విశాలమైన గది, మంచి పరుపులు, పంకా అన్నీ వున్నాయి ! సత్రంనుంచి సామాన్లు తెప్పించేస్తా !

నారా : హో ! ఇప్పుడే వెళ్ళి అన్నియేర్పాట్లూ చేసిరా ! వారు విశ్రాంతి తీసుకోవడం చాలా అవసరం !

[ యజమాని సంతోషంగా ఈలలు వేసుకుంటూ వెళ్ళిపోతాడు. ]

నారా : రావుగారూ ! ఏమైనా ఉత్తరాలు పంపాలా, స్నేహితులకుగాని, బంధువులకుగాని, ఫర్వాలేదు చెప్పండి !

మా : (శీఘ్రంగా) ఒక గంట ఆగు ! తర్వాత చూద్దాం !

నారా : అలాగే !...(తడబడుతూ) అప్పుడు...మనం అనుకున్న ...విషయం !

మా : తర్వాత మాట్లాడదాం !

నారా : మళ్ళీ వెంకట్రావొస్తాడు !

మా : వస్తేరానీ ! అన్నపూర్ణా ! నీవు చీరలు కావాలన్నావు గదూ; బట్టలూ, సామాన్లూ, ఆ జాబితా జ్ఞాపకం వుందా, అప్పుడు హోటల్లో మనం తెప్పించాం చూడు !

అన్న : అంతా జ్ఞాపకంవుంది ! కాని...డబ్బు ?

మా : ఇతనిదగ్గర ఎనిమిది వందలుంది! (ఆలోచిస్తున్నట్లు) చాలుతుందో చాలదో !

నారా : (సంతోషంగా డబ్బుతీసి అన్నపూర్ణ కివ్వబోతూ) ఉంచండి! మీరే వాడండి! నా కివ్వాసంత అవసరం లేదు!

అన్న : నా దగ్గరెందుకు! మీరే సామాన్లు—

నారా : ఫర్వాలేదు, ఉంచండి! సామానుకు ఎంతకావాలో తీసు కుంటాను! (మాణిక్యంతో) మన కిష్టాకు ఏం కావాలో చెప్పండి, తీసుకొస్తాను!

మా : అర్జెంటుగా వెళ్ళి ఆ ఎదురుగావున్న బట్టలషాపులో రెడీ మేడ్ షర్టులు, బుష్‌కోట్లు, పాంట్స్; అన్నపూర్ణకు సిల్కు చీరలు! అన్నపూర్ణా! ఆ జాబితా వ్రాసివ్వు!

నారా : (కలం, కాగితం తీసి) చెప్పండి, రాసుకుంటాను!

అన్న : ఎందుకు, నేను వ్రాస్తాను! (కలం, కాగితం అందుకుని వ్రాస్తున్నది.)

మా : (ఉత్తరీయం తీసి చిరిగిన చొక్కా చూసుకుని) చొక్కా లన్నీ చినిగిపోయినై!

నారా : (చొక్కా పట్టుకుని చూసి) దీనికేమండీ? బ్యూటిఫుల్ క్లాత్! (అన్నపూర్ణతో) త్వరగా రాయండి! ఒక్క క్షణంలో పట్టుకొచ్చేస్తాను! (మాణిక్యంతో) లేకపోతే వెంకట్రావును పంపుదామా?

మా : అవును, అతన్ని పంపు! నిజాయితీగా పనిచేస్తాడు!

నారా : (ఆలోచించి) ఎందుకు నేనే వెళతాను లెండి! అతనికి నిజాయితీవుందని మీరనుకోవలసిందే!

[ వెంకట్రావు కృష్ణను వెంటబెట్టుకుని వస్తాడు. ]

కృష్ణ : (పరుగెత్తుకొనివచ్చి సంతోషంగా) ఏం నాన్నా ! నాకే దమ్మా ! స్వీట్ ?

మా : నారాయణరావ్ ! కృష్ణకేం కావాలో ఆర్డరివ్వు, త్వరగా!

నారా : వైటర్ ! ఇలారా ! రెండు స్వీట్స్, హాట్స్ అన్నీ !

వెంక : కాఫీ తీసుకుంటావా, ఓవల్టిన్ తెప్పించనా ?

కృష్ణ : ఊహు ! ఓవల్టిన్ మా కలవాటు లేదు !

మా : (పూర్వస్థితి బైటపెట్టాడనే బాధ కోపంగామారి) కృష్ణా ! గోలచెయ్యకుండా కూర్చో !—అన్నపూర్ణా ! కృష్ణకేం కావాలో అన్నీ రాయి !

కృష్ణ : (సంతోషంగా) అమ్మా ! నాకు బాడ్మింటన్ బాట్, సైకిలు—

అన్న : (జాబితా పూర్తిచేసి) అన్నీ రాశాను! (భర్తతో) మీకు డజన్ నెక్టైలు సరిపోతాయా ?

మా : చాల్లే ప్రస్తుతానికి ! డబ్బిచ్చి పంపు !

అన్న : (డబ్బు తీసియిస్తూ) ఇదిగో ఐదు వందలు !

నారా : (డబ్బు, జాబితా తీసుకుని) ఇక్కడున్నట్టు వచ్చేస్తాను. (వెళ్ళిపోతాడు.)

మా : (పెద్దగా) నాకు తొమ్మిదో నంబరు బూటు తీసుకురా !

నారా : (బైటనుంచి) ఓ, నేనే స్వయంగా పట్టుకొస్తా !

[ వెంకట్రావు ఇంతసేపు మాణిక్యం, నారాయణ రావుల స్నేహాన్ని చూసి ఈర్ష్యపడుతున్నాడు. ]

మా : (గ్రహించి, చిరునవ్వుతో) వెంకట్రావ్ ! ఒక పెద్దప్లాను వేస్తున్నాను. ఇది నా జీవితంలో కడపటి అధ్యాయం ! అద్భుతంగా వుంటుంది !

వెంక : నాకు తెలుసు! మీరు ప్లానువేస్తే మళ్ళీ దానికి తిరుగుంటుందా? మీ జాతకం బ్రహ్మాండమైంది! మీరు మట్టి పట్టుకుంటే బంగారం కాదటండీ?

[ మాణిక్యాలరావు, అన్నపూర్ణ సంతోషంగా నవ్వుతారు ]

వెంక : అప్పుడే డబ్బు వచ్చేసిందే! నారాయణరావేమైనా?...

మా : (ఠీవిగా) అవును! ఇవాళ ఖర్చుకు నారాయణరావిచ్చాడు!

వెంక : అతని డబ్బెందుకండీ! మీకేమైనా అవసరముంటుందేమోనని ఐదువందలు పట్టుకొచ్చాను. (జేబులోనుంచి తీసి) అట్టిపెట్టండి!

మా : (నిర్లక్ష్యం నటిస్తూ) ఇప్పు డక్కర్లేదులే!

కృష్ణ : (ఆశ్చర్యం దాచుకోలేక) అమ్మో! ఐదువందలే! తీసుకో నాన్నా! ఇవ్వకపోతే ఇవ్వలేదంటావ్, ఇస్తుంటే తీసుకోవేం?

అన్న : (వారించుతూ) నువ్వూరుకో, కృష్ణా!

వెంక : (బలవంతం చేస్తూ) ఫర్వాలేదు, తీసుకోండి! ఎట్లాగో కలిసిమెలిసి పోవాలనిగాని.....రేపు మన వ్యాపారంలో నేను సగభాగం తీసుకోవాలంటే—

[అన్నపూర్ణ ఆశ్చర్యపోతుంది.]

మా : (తాపీగా) ఓహో! అదా! మీరంతా ఇప్పుడు గ్రహిస్తున్నారేం? ఇప్పుడు! ఇవ్వండి! [తీసుకుంటాడు.]

వెంక : మనం అనుకున్నదేగా, ఇందులో కొత్తేముంది? మీరు ఆమధ్య వాగ్దానం చేశారుగా......

మా : మరి నారాయణరావుగో? అతను భాగం పంచుకోవడం నీ క్కిష్టమేనా!

వెంక : అతను నమ్మకస్తుడేనంటారా? మీకే తెలియాలి! ఈ పట్నంలోనే అతను పుట్టిపెరిగినా, ఇక్కడమాత్రం అసలు పలుకుబడి లేదు, మర్యాద లేదు!

మా : (నవ్వుతూ) మరెక్కడైనా వుందా?

వెంక : ఆఁ, తెలిసినచోటే లేకపోతే తెలియనిచోట ఎలా వుంటుంది!

[ మాణిక్యాలరావు, అన్నపూర్ణ నవ్వుతారు. ]

మా : మీరు లౌకికులు!

[ నారాయణరావు తిరిగి వస్తాడు. ]

మా : అప్పుడే వచ్చేశావే?

నారా : సిల్కు చీరలు, కోట్లు అవీ తెచ్చేశాను. మిగిలినవన్నీ టూ మినిట్స్‌లో వచ్చేస్తాయ్. ప్రత్యేకంగా ఇద్దరు మనుష్యుల్ని పంపించాను!

మా : నువ్వే వెళ్ళిరాకపోయావా? అంత నిర్లక్ష్యమేఁ?

నారా : (విధేయతలో) ఎంతమాటన్నారు! మీరేం చెయ్యమంటే అది కళ్ళుమూసుకుని చేస్తా! మీమీద గురుభావం ఏర్పడింది!

మా : (నవ్వుతూ) డబ్బుమీదా? నామీదా? డబ్బు కలిగిన నామీదా?

[ నారాయణరావు అటూ ఇటూ పచారుచేస్తాడు. వెంక ట్రావును తేరిపారచూస్తాడు. అవకాశం పోతుండేమో నన్న భయంతో మాణిక్యం దగ్గరికి వెళ్ళి కూర్చుంటాడు. ]

నారా : మీతో ఆ విషయం మాట్లాడాలని కోరుచేం...చాలా
ఆదుర్దాగా—

మా : ఆగు! ఆగు! – అన్నపూర్ణా! ఏవో కొద్దిగా బాకీ
లున్నట్టున్నై! మేడమీది గదిలోకెళ్ళి అవన్నీ లెక్క
చూసి వైటర్‌చేత పంపించు! బాకీలన్నీ తీర్చేయ్!
(అన్నపూర్ణ వెళ్ళబోతుంది) చూడు! ఆ బట్టలేమిటి?
శుభ్రమైన కొత్తబట్టలు కట్టుకో! పో, కృష్ణా!

[అన్నపూర్ణ, కృష్ణ వెళ్ళిపోతారు.]

నారా : వైటర్! ఆ కోట్ ఇలా తీసుకురా! ఆ లాంగ్‌కోట్!
(మాణిక్యంతో) మీకు బ్యారిష్టర్‌గా వుండనీ సార్!

[వైటర్ వెళ్తాడు. హోటల్ యజమాని వస్తాడు.]

యజ : (అతివినయంగా) గది తాళంచెవులు అమ్మగారికిచ్చాను!

మా : (ధీమాగా) ఇచ్చావు సరే! మీ గుమాస్తా లేడూ?

యజ : ఉన్నాడు, ఎక్కడికైనా పంపించాలా? పిలవమంటారా?

మా : నా దగ్గరకెందుకు; నా కింకేం పని లేదనుకున్నారా? అతని
చేతికొక వెయ్యిఇచ్చి ఒక చక్కని నెక్‌లెస్ తెప్పించు!
(యజమాని ఆశ్చర్యపోతాడు. మాణిక్యం అతన్ని
గద్దిస్తూ) అన్నపూర్ణకు కావాలి!

నారా : (యజమానితో) తెప్పించండి!

వెంక : (యజమానితో) డబ్బు వచ్చినతర్వాత తీసుకోవచ్చు
లెండి!

యజ : (భయపడుతూ, మాణిక్యంతో) రేపు....ఉదయం....
మీకు ప్రైజ్‌డబ్బు వచ్చినతర్వాత.....

[ఇంతలో వైటర్ లాంగ్ కోట్ తీసుకొస్తాడు. మాణిక్యాలరావు వేస్తాడు. నారాయణరావు అతనికి కోటు తొడుగుతుంటే, వెంకట్రావు సహాయం చేస్తున్నాడు.]

మా : (కోటు తొడుక్కుంటూ, యజమానితో అధికారయుతంగా) వీల్లేదు! రేపు పైమొక్కడుంటుంది? ఇప్పుడే కావాలి!

నారా : ఇప్పుడు తెప్పించయ్యా!

మా : (నారాయణరావుతో) ఎవరికోసం తెప్పిస్తాడు? దీనికి విూరిక మెండేషన్ ఏమిటి?

యజ : (భయపడతూ) అలాగేనండి! (వెళ్ళిపోతాడు.)

మా : (కోటు తొడుక్కోవడం పూర్తయింది. కోటు చూసుకుంటూ దర్జాగా) ఎలావుంది? ఊఁ? చక్కని శరీరమైతే కోటుకుగూడా అందంవస్తుంది, ఏమంటారు?

నారా
వెంక } అవునవును! నిజమే!

మా : (హేళనగా) ఇద్దరూ ఏకగ్రీవంగా మాట్లాడుతున్నారే!

నారా : (అతి వినయంగా) భాగస్థులం—

వెంక : (అతి వినయంగా) ఒకరి నొకరు—

మా : దూషించుకోకపోతే ఎలాఅనా!

వెంక : ఏం అలా అంటున్నారు?

నారా : మనల్నెవరు దూషిస్తారండీ?

మా : ఈ 'మనం' ఎప్పటినుంచి? నాతో సమానంగా మాట్లాడేటంత అహం వచ్చిందేం?

నారా : (ఆశ్చర్యపడి, వెంకట్రావుతో) చిత్రంగా మాట్లాడతారోయ్!

వెంక : అలా వుంటేనే మనకు జయం!

మా : (సూటిగా) అది కాదయ్యా! నేను వ్యాపారం పెడితే అందులో మీరేం చేస్తారు? మీకు నిజంగా భాగం కావాలా...నాలో? నా జీవితంలో? ఎందుకు?

నారా : అందరం కలిస్తే—

వెంక : లాభం సంపాదించి—

మా : (యజమానిలాగ) మీరు జాగ్రతగా పనిచేస్తారా?

నారా
వెంక | ఓ, తప్పకుండా!

మా : నా అదుపాజ్ఞల్లో వుంటారా?

నారా
వెంక | అంతకంటే మాకేం కావాలి?

మా : (తీవ్రంగా) నా కష్టార్జితమందు కోపం వస్తుంది, కేక లేస్తుంటాను.

నారా : మీరలా అంటారుగానీ—

మా : నావాళ్ళు నాకు తెలియదు; దబాయిస్తాను!

వెంక : మీరు సరదాగా అంటేమాత్రం; అయినా మనలో మనకేమిటి?

[మాణిక్యాలరావు ఇంతసేపు వాళ్ళను అవమానిస్తూ మాట్లాడాడు. ఎంతకూ వాళ్లు ఎదురుతిరగకపోవడంవల్ల తన పగ సాధించదలచినా, సంతృప్తి కలగటంలేదు. అతనిలో ద్వేషం హెచ్చి తీవ్రరూపం దాల్చుతుంది.]

మా : (సూటిగా) మీరు మనుష్యులేనా? మీలో అణుమాత్రమైనా మానవత్వం వుందా? మీకు లేవూ విషపుకోరలు?

[నారాయణరావు, వెంకట్రావు లతని ధోరణి అర్థంకాక తికమకపడతారు]

నారా : ఏమిటీ సంగతి? ప్రొద్దున్న మిమ్మల్ని—

వెంక : కొంచెం విసిగించామూ :

మూ : కాదు, వేధించారు! నేను జైలునుంచి బైటపడిన మరు క్షణంనుంచి పగబట్టిన త్రాచుపాముల్లాగ నా వెంట పడు తున్నారు!...(పెద్దగా) నేను సహించను! నేను భయ పడను!

నారా : అదేమిటి? మామీద మీకంత కష్టంవేసిందా?

వెంక : అంతబాధ పెట్టామూ?

మూ : మీరేకాదు; మీవంటివాళ్ళు వందలు, వేలమంది! ఈ వీధుల్లో తిరిగేవాళ్ళు, ఈ భవనాల్లో బ్రతికేవాళ్ళు.... అందరూ నన్ను నీచంగా క్రూరంగా హింసిస్తున్నారు!

నారా : (ఆశ్చర్యంతో, కొంచెం కోపంతో) అందుకు మేమూ బాధ్యులం?

వెంక : (విసుగుపడుతూ) చాలా బాగుంది!

మూ : (వెంటనే) ఉండదూ మరి! ఏమయ్యా వెంకట్రావ్! పగలు వ్యాపారం, రాత్రి జూదం, నీ జీవితమంతా ఇంతే గదా; నీవు వెళ్ళి నామీద పుకార్లు పుట్టిస్తావా? నన్ను గురించి వీధివీధికీ చాటిస్తావా? నన్ను నీచంగా అవమా నిస్తావా? (నారాయణరావువైపు తిరిగి ద్వేషంతో) నీవు గదూ పెద్దపెద్ద వాళ్ళదగ్గరికి వెళ్ళి, 'ఏడికేమైనా ఉద్యోగ మిస్తారేమో, పచ్చిదొంగ' అని నూరిపోశావ్! ఏం? నేను నీ సొమ్మేమైనా అపహరించానా? (వెంకట్రావుతో) నే నేవరికేం అపకారం చేశాను?

నారా : (సముదాయించాలని) రావుగారూ! ఇంతలో కోపం, ఇంతలో నవ్వు అయితే ఎలాగండీ?

వెంక : (సమాధానం చెపుతూ) నేను అపకారం చేసేవాణ్ణయితే కష్టపడి దాచిపెట్టుకున్న డబ్బు తెచ్చి మీచేతి కిస్తానా!

నారా : మీ రడగకముందే డబ్బిచ్చి వస్తువులన్నీ తెప్పించానే!

మూ : (మీ కుట్ర నాకు తెలుసునన్నట్టు నవ్వి) నా కోసం తెచ్చారా? నన్ను మోసంచెయ్యాలని మీరు ఆత్మ వంచనకు దిగుతున్నారా? (పెద్దగా) అన్నపూర్ణా! ఇలా రా! (అన్నపూర్ణ వస్తుంది. సిల్కుచీర కట్టుకుని, తల దువ్వుకొని, పూలుపెట్టుకుని వున్నది.) నాకు టెలిగ్రాం రావడం చూసిగదూ వీళ్ళిద్దరూ డబ్బిచ్చారు? (వాళ్ళతో) అవును! మీ తత్వం నాకు పూర్తిగా అర్థమయింది! మీలో నేటి జీవితంలో స్వార్థం, కౌటిల్యం మూర్తీభవించాయి. మీరేకాదు, మీ పెద్దమనిషి వేషాలను, పెద్దపులుల మనస్సులను ఎక్కడచూచినా నా గుండె క్రోధంతో ద్వేషంతో భగ్గున మండుతోంది!

నారా : అన్నపూర్ణగారూ! ఈమాటలేమిటండీ? వీరికి మతి గాని—

అన్న : (భర్తతో శృతికలిపి) మీకు మతిపోయిందేమో! ఆయన చెపుతున్నది అక్షరాలా నిజం! మీవంటివాళ్ళు కొన్ని వేలమంది మమ్మల్ని అవమానపరిచారు! రాత్రింబగళ్లు నౌకిరీచేస్తున్నా దారిద్ర్యం, అవమానం రాబందుల్లాగ మా సంసారాన్ని పొడుచుకుతిన్నాయి! మా ఆశలు మీ చెప్పులకింద పూలలాగ నలిగిపోయినై! మా జీవి

తోలు కనపడనిగాయాలతో చితికి రక్తమోడ్చుతున్నై!

వెంక : ఓహోహో! ఇద్దరూ ఒకటైనారా!

రమా : (భార్య ఆవేశాన్నందుకుంటూ) మే మిద్దరమే మీకు కన్పిస్తున్నామా! ఈ దుస్సహ జీవితాన్ని సహించలేక హతమైపోతున్న లక్షలాది నిర్భాగ్యులు మాలాగే నరక బాధతో దగ్ధమైపోతున్నారు! మాలాగే ప్రతిక్షణం పగతో ప్రజ్వరిల్లుతున్నారు! బైటపడి మాట్లాడలేరు! లోకంనిండా తిరుగుతున్న మీవంటి ఆత్మవంచకులను చూసి భయపడుతున్నారు!

నారా : (ఎదురొడ్డే వుద్దేశంతో) ఆఁ! మీరు భయపడబట్టే ఇలా మాట్లాడుతున్నారు!

వెంక : (నిర్లక్ష్యంగా) అంతా వెర్రివేదాంతంగా వుంది!

అన్న : (కోపంగా) అనుభవించే వాళ్ళబాధ చూసేవాళ్ళకేం తెలుస్తుంది! మీరు డబ్బిస్తున్నప్పుడే అనుకున్నాను, ఏదో పన్నాగం వుందని! ఇప్పుడు తెలిసింది!

నారా : (సమాధానపరుస్తూ) మేమేమీ అనలేదమ్మా! టెలిగ్రాం వచ్చినప్పటినుంచి రావుగారి ధోరణే పూర్తిగా మారిపోయింది!

వెంక : డబ్బిచ్చినందుకు వడ్డీ!

[యజమాని త్వరగా లోపలికి వస్తాడు.]

యజ : రావుగారూ, క్షమించాలి! అలా పెద్దగా మాట్లాడుతుంటే హోటల్ మోగిపోతోంది! కొంచెం నెమ్మదిగా మాట్లాడండి!

రమా : (దబాయిస్తూ) నెక్‌లెస్ తెప్పించావా!

యజ : పంపించానండీ, ఈపాటికి వచ్చేస్తుండాలి! చూడండి! మీ వస్తువులన్నీ వచ్చేసినై! కొన్ని ఇక్కడికి తీసుకు రమ్మని చెప్పాను—మీ రొకసారి చూస్తే ఆ తర్వాత గది లోకి సర్దేస్తాం!

మా : అలాగే! పంపించండి! (యజమాని సంతోషంగా వెళ్ళి పోతాడు.) అన్నపూర్ణా! ఆ బట్టలూ అవీ అందుకో! (నారా, వెంకట్రావులతో) మీరు కూడా ఆ పనేదో చూడండి! (వాళ్ళు సందేహిస్తుంటే) మీకు తప్పకుండా భాగ మిస్తానులే! (వాళ్ళిద్దరు సంతోషంగా బయట నుంచి సామాన్లు అందుకుంటున్నారు.) ఇవాళ లోకం మమ్మల్ని ఆదరించి గౌరవించింది! మీకు తప్పకుండా భాగమిస్తాను!

[వైటరు, అన్నపూర్ణ సామాన్లు సర్దుతున్నారు. నారాయణరావు, వెంకట్రావు పనిచేస్తూనే మాణిక్యాన్ని పరీక్షగా చూస్తున్నారు. ఆ వస్తువులన్నీ ఇంతకుముందు మాణిక్యం ఆసక్తితో తెప్పించిన విధంగానే వున్నాయి. తీరని కోరికలు తీర్చుకోడానికి మళ్ళీ ప్రయత్నిస్తున్నాడని ఆ కోట్లు, షర్టులు, సిల్కు చీరలు రుజువుచేస్తున్నాయి. నారాయణరావు, వెంకట్రావు భక్తితో సేవచెయ్యడం మాణిక్యం గమనించాడు. అతనిలో ద్వేషం ఆగి, ఆగి ఒక్కసారి పైకుబుకుతుంది]

మా : చూశారా! మిమ్మల్నే! చూశారా! (వాళ్ళిద్దరూ అతని వంక చూస్తారు) ఈ వస్తువులన్నీ ఎలా వచ్చినై? ఇక్కడి నుండి నేను బైటికి కదిలానా? లేదు! మీరు తెచ్చారు! ఎందుకు తెచ్చారు? (నారాయణరావు, వెంకట్రావు ఆశ్చర్యంతో ఒకరినొకరు చూసుకుంటారు.) చెప్పండి,

మీ రెందుకు తెచ్చారు? మీ స్వార్థం కోసం! నేను నా ఆనందంలో భాగమివ్వ లేనేమో అని మీ భయం! అందుకే ఇన్నాళ్ళు నన్నవమానించినవాళ్ళు, ఇప్పుడు నేను చెయ్యాలని చేస్తున్న అవమానాన్ని భరిస్తున్నారు! డబ్బు, దర్పం లేకపోతే ఈ దరిద్రలోకంలో రాక్షస నృత్యంచేసే మృత్యువుకు బలియైపోతామని మీ భయం! అంతేనా?—ఈ దుస్తులు, దర్జాలు, డాబులు లేకపోతే మీ నటనకు లోకం మోసపోదేమో అని భయం! స్వార్థం, మోహం లేకపోతే బ్రతుకు ఒక్క క్షణంగూడ సాగదని భయం! భయం! బ్రతుకు! భయం!...... మీరు నాలోకాదు, ఈ లోకంలో భాగస్వాములు! నన్ను ప్రతిక్షణం హింసపెట్టే ఈ రాక్షసత్వంలో మీలో ప్రతి ఒక్కరికి భాగంవుంది!

[నారాయణరావు, వెంకట్రావు ముఖాలు పాలిపోతాయి. ఏంమాట్లాడాలో తోచదు. ఇంతసేపూ దిగాలుపడి చూస్తున్నారు.]

వెంక : మమ్మల్ని అందరితోపాటే జమకట్టేశావా!

నారా : ఇదేనా మీరనవలసిన మాట!

మా : (గంభీరంగా) ఇది సత్యం! సత్యం సహజంగానే భయంకరంగా వుంటుంది! ఇన్నాళ్ళూ దాన్ని ప్రకటించే అధికారం నాకులేదు! ఇప్పుడీ చరమస్థాయిలో నాకా హక్కుంది! కోపమా? ద్వేషమా? ఎందుకు! నేనన్నది కొత్తదికాదు, మీకు తెలియక బాధపడేది; మీకు తెలిసినా భరించలేక మరిచిపోయేది! ప్రతివారూ ఒక్కక్షణం తమ జీవితాలను పరీక్షించుకుంటే స్పష్టంగా తెలుస్తుంది!

యజ : (లోపలికివచ్చి, వినయంగా) రావుగారూ! మీకు నమస్కారం పెడతా! కొంచెం చెమ్మదిగా మాట్లాడండి! మా బిజినెస్ ఆగిపోతుంది! క్షమించండి! (వెళ్ళిపోతున్నాడు.)

మా : వెళతారేం? మీతో మాట్లాడాలి! (యజమాని భయంతో తిరిగివస్తాడు.) చూడండి! ఒక ప్రపోజల్ పెట్టాలనుకుంటున్నాను!

యజ : అలాగే! మీ యిష్టం నేను కాదంటానా?

మా : ఈ హోటల్ నాకు అమ్మేస్తారా!

[ ఇంతసేపూ కోపంగా చూస్తున్న నారాయణ
రావు, వెంకట్రావు ఆశ్చర్యపడతారు. ]

యజ : (నివ్వెరపోతూ) హోటలా? మీకా?

మా : అవును! నేను నడుపుతాను! మీకు కావాలంటే మానేజర్ ఉద్యోగం ఇస్తా!

యజ : క్షమించండి! మా తండ్రిగారు పెట్టిన హోటలు! ఏదో మొదటినుంచీ మేమే దీన్ని......

మా : మీ తండ్రీ, మీరూ.....మీ పుట్టుపూర్వోత్తరాలన్నీ నాకు తెలుసు! మీ భాగస్తుల్ని నిలువునాముంచి మీరు దీన్నెలా స్వంతం చేసుకున్నారో నాకు తెలుసు! అసలు దీని పెట్టుబడి మీ తండ్రికి ఎవరిద్వారా, ఏం చేస్తే వచ్చిందో___

యజ : (హడలిపోయి) వద్దు, వద్దు!

మా : (నవ్వుతూ, విజయగర్వంతో) పరువనీ, ప్రతిష్ఠఅనీ, ఆస్తి అనీ, అధికారమనీ విర్రవీగేవారి జీవితాలకు పునాదులు

ఎంత నికృష్టంగా వుంటారో ఒక్కసారి చూపిస్తాను!

యజ : (శిష్యాలని కంగారుపడుతూ) క్షమించండి! మళ్ళీవస్తాను—
(వెళ్ళబోతున్నాడు.)

మూ : (గట్టిగా) ఇదిగో, ఒక్కమాట! ఇలా రావాలి! (తప్పని సరియై యజమాని వచ్చి భయంగా నిలబడతాడు.) అర్జెంటుగా ఫోన్ చేసి, ఒక టాక్సీ పిలిపించు! (యజమాని వెళ్ళిపోతాడు) అన్నపూర్ణా! నీకేనేం కావాలో అన్నీ తీసుకో! మనవూరికి బయలుదేరుతున్నాం!

[ అందరూ ఆశ్చర్యపడి ఒకరినొకరు చూసుకుంటారు. ]

వెంక : (ఆదుర్దాగా) ప్రయాణమౌతున్నారా?

నారా : (గడ్డి చెప్పబోతూ) ప్రైజ్ డబ్బు ఇక్కడికే వస్తుందిగా!

వెంక : పోనీ, ఒక్క రోజు ఉండగూడదూ?

మూ : (నిర్లక్ష్యంగా) ఇవన్నీ మీా కెందుకు? (గద్గదంగా) అక్కడికే వెళతాం, అక్కడే అనుభవిస్తాం!

నారా : అక్కడికిపోతే మమ్మల్ని మరిచిపోతారు!

వెంక : ఎంతమంది స్నేహితులో!

మూ : ఏం, మీాకుతప్ప స్నేహితు లుండగూడదా! మిమ్మల్ని మరిచిపోగూడదా?

[ఇంతసేపూ అన్నపూర్ణ ఎంతో సంతోషంతో వస్తువులు సర్దుతూవుంది.]

యజ : (లోపలికి వచ్చి) టాక్సీ వచ్చేస్తోంది!

మూ : అన్నపూర్ణా! త్వరగా తయారుకావాలి, టైంలేదు! బయలుదేరాలి! (కృష్ణ కొత్తబట్టలు ధరించి వస్తాడు.) కృష్ణా! నీ వస్తువులన్నీ సర్దుకో, మనం ఊరికి వెళ్ళాలి!

యజ : (ఆశ్చర్యంతో) ఏమిటీ! ఎక్కడికీ ప్రయాణం?

నారా : (కోపంగా) వాళ్ళవూరికి వెళ్ళిపోతారట!

వెంక : (కోపంగా) మరి మన సంగతేమిటి?

నారా : [ప్రాధేయపడుతూ] నాలుగురోజు లాగండి, మీ డబ్బు అందుకుని, నా కివ్వవలసింది ఇచ్చేసి—

అన్న : వద్దండీ, ఇప్పుడే బయలుదేరుదాం!

మా : వీల్లేదు! ఇక మేమూరుకోలేం! వెంటనే వెళ్ళిపోవాలి! ఇక నేను భరించలేను! [తనలో తాను కలవరించినట్లు] భరించ లేను! భరించ లేను!

నారా : [ఆగ్రహంతో] మీరేం భరించాలి? డబ్బు చేతికవస్తే చేదయిందా?

వెంక : [కేకలేస్తూ] మీ రిక్కడే వుంటారనుకున్నాం!

మా : [గద్గదంగా, అతిమెల్లగా] ఎందుకుండాలి? నే నుండను! ఊహుం, నే నుండలేను!

యజ : మీ మీద మేమింత పెట్టుబడి పెడితే—

నారా : మీరు బయలుదేరడానికి ఏమాత్రం వీల్లేదు—.

వెంక : మాకు భాగమిస్తానని—

యజ : మా డబ్బంతా ఖర్చుపెట్టి—

[వారిమాటలు క్రమక్రమంగా స్థాయి హెచ్చి కేకలుగా మారాయి. మాణిక్యాలరావుకు వీరిమాటలేవీ విన్పించడంలేదు.]

మా : [ఏదో మనసులో దాచుకోలేక బాధపడుతూ] అన్నపూర్ణా! ఆలస్యం చేస్తావేం? బయలుదేరవేం! [వారితో ఎంతో మెల్లిగా] ఏమంటారు? మీరు నా కోసం డబ్బిచ్చారా? నా అవసరంకోసం?

నారా : [విసురుగా] ఎలా వెళతావయ్యా! [అడ్డునిలబడతాడు]

వెంక : [మొరటుగా] మీ తరంకాదు, మాకు భాగమిచ్చితీరాలి!

యజ : [దబాయిస్తూ] ఈ హోటల్‌నుంచి ఒక్క అడుగు బైట పెట్టడానికి వీల్లేదు!

అన్న : (కోపంగా దగ్గిరకువచ్చి) మా ఇష్టం, మేం వెళ్ళిపోతాం!

మా : మీకు భాగంకావాలా నా ఆదాయంలో? నా జీవితంలో? నా దుఃఖంలో? ఇదుగో తీసుకోండి! మీరంతా ఇచ్చిన బహుమానం ఇదే! (ఆవేదనతో ఏదో రహస్యం చెప్ప బోయినట్లు మాట్లాడతాడు. తన మనస్సు స్వాధీనం తప్పుతుంది. భార్యనుంచి ముఖం చాటుచెయ్యాలని ప్రయత్నంచేసి ప్రక్కకు వెళతాడు.)

అన్న : (అనుసరిస్తూ) ఏం జరిగింది? ఏమిటిది? నాకు చెప్పరూ?

మా : (జేబులో టెలిగ్రాం తీస్తాడు. అది అతని జీవితపతాక అయినట్టు చేతితో పైకెత్తుతాడు. నారాయణరావు ఆ టెలిగ్రాం లాక్కుంటాడు. మాణిక్యాలరావు ఒక్కసారి పెద్దగా ఏడ్చినట్లు కేకపెడతాడు.) ఇదిగో! విన్నావా, అన్నపూర్ణా? మన బాబు చనిపోయాడు! విన్నావా, మన బాబు చనిపోయాడు!

[అన్నపూర్ణ, కృష్ణ అతన్ని కౌగలించుకుని ఘోరున ఏడుస్తారు.]

నారా: / వెంక : / యజ : (ముగ్గురూ కలిసి టెలిగ్రాం చదువుకొని) మోసం! మోసం! మోసం! (అని కేకలుపెడతారు.)

మా : (పెద్దగా) హంతకులు! అన్నపూర్ణా! వీళ్ళంతా హంతకులు!

[తెర జారుతుంది]

## వాస్తవ జీవిత దృశ్యం :

### - చివరి భాగం -

[ మొదటి భాగంలోకలిసే మాణిక్యాలరావు ఇంటిలో అన్ని వస్తువులూ అమర్చి వుంటాయి. మాణిక్యాలరావు నిద్రపోతున్నాడు. గడియారం సాయంత్రం 7-5 గంటలు చూపిస్తున్నది.
మాణిక్యాలరావు హఠాత్తుగా నిద్రలేస్తాడు. ]

మా : (పడకకుర్చీలోనుంచి దిగ్గునలేచి, భయంతో పెద్దగా కేకలువేస్తూ) హంతకులు! హంతకులు! (దిగ్భ్రాంతితో అన్నివైపుల కలయజూస్తాడు.)

అన్న : (త్వరగా కాఫీ ఒకచేతితో, లాంతరు ఒకచేతితో తెచ్చి బల్లమీద పెట్టి) ఏమిటండీ ఆ కేకలు?

మా : (ఇంకా స్వప్నంలోనే) మనబాబు చనిపోయాడా? ఆఁ! ఏం జరిగింది?

అన్న : (ఈసడింపుగా) ఏమిటా విపరీతపు మాటలు? చాల్లెండి! వాడికేం, హాయిగా మా అమ్మదగ్గరున్నాడు!

మా : (ఉద్రేకంతో) స్వప్నం! స్వప్నం!

అన్న : చాలెండి! ఇన్నాళ్ళూ చూడకుండా వాడిమీదే ధ్యాస పెట్టుకోవడంవల్ల అలా వచ్చివుంటుంది! (అతని ముఖం పరికించి చూస్తూ) ఆ కన్నీళ్ళేమిటి? ఆ నవ్వేమిటి? ప్రొద్దస్తమానం స్వప్నాలేనా?

మా : (తెలివివస్తూ, వాస్తవలోకంచూచి ఆశ్చర్యపడుతూ) ఎవరైనా వచ్చారేమో చూశారా?

అన్న : ఏవో స్తారు ! మీా వైఖరిచూస్తే నాకు భయంగావుంది ! కాఫీ తెమ్మంటారు, నిద్రపోతారు ! క్షణంలో కన్ను మూస్తారు, కలలుగంటారు ! అవేమి కలలోగాని, అందు లోనే నవ్వులు, కేకలు, కన్నీళ్ళూ....హుం ! ఈ పడక కుర్చీ విరగగొడితే బాగుండును !

మూ : (కోపంగా) ఆమాట అనవద్దని అనేకసార్లు నీకు వార్నింగ్స్ యిచ్చాను ! (దగ్గరకువచ్చి నవ్వుతూ) ఇవ్వాళ ఎలాంటి స్వప్నమనుకున్నావ్ ! అద్భుతం ! అద్భుతం !

అన్న : ఆఁ, మొదలుపెట్టారూ ! నాకేం చెప్పవద్దులెండి, నన్నెం దుకేడిపిస్తారు ! ఇదిగో కాఫీ తీసుకోండి !

మూ : (స్వప్నం నెమరువేసుకుంటూ) నీకు నెక్ లెస్ తెప్పించాను; బ్యూటిఫుల్ నెక్ లెస్ !

అన్న : (వెటకారంగా) ఆఁ, అవును! రోజుకు పదిసార్లు కొంటారు, ఇలాంటి సొమ్ములు ! మనం కొననివేమున్నయ్, అనుభ వించనివేమున్నయ్ !

మూ : నిజంగా ! నన్ను చూస్తున్నవాళ్ళంతా విస్తుపోయారు. మద్రాస్ లో బీచ్ హోటల్ లో మకాం !

అన్న : (అతన్ని వాస్తవలోకంలోకి రమ్మని) కాఫీ చల్లారిపోతోం దండీ !

మూ : (అదే ధోరణిలో) మన మానేజింగ్ డైరెక్టర్లతో సహా అందరూ గడగడ లాడిపోయారు !

అన్న : (నవ్వుతూ) అందుకేనా కేకలేస్తూ లేచి కన్నీళ్ళు కారు స్తున్నారు !

మా : (గర్వంగా) లేదు; ఇవాళ లోకమంతా నన్నెదిరించినా అతిసులభంగా అందరిమీదా అధికారం చలాయించాను!

అన్న ! పోనీలెండి, పాపం ! ఇన్నాళ్ళకన్నా జయించారు !

[మాణిక్యం విచారంగా వున్నాడు.]

అన్న : ఏం జయించలేదూ ? మళ్ళీ మీరే ఓడిపోయారా ?

మా : (సిగ్గుపడుతూ) అవును. ఓడిపోయాను ! అంటే అది ఓటమి కాదనుకో !

అన్న : సరేలెండి ! స్వప్నోద్రేకం ఎంతసే వుంటుంది......కాఫీ తాగండి !

మా : (స్వప్నం మరిచిపోలేక) కొన్నివేలు ! లక్షలు ! సంపాదించాను ! నిజంగా అంత డబ్బుంటేనా ! ఆహా !—

అన్న : (వెంటనే) ఉంటే ఏంచేస్తారు ? ఉద్యోగం మానేస్తారా ? అదిమాత్రం మానకండి, పుణ్యముంటుంది !

మా : అబ్బబ్బ ! ఈ స్వల్పవిషయాలతో నన్ను వేధించకు !

అన్న : (విసుగుతో) ఆఁ ! మీరు స్వప్నలోకంలో సంపాదించే ఆ సంతా కట్టుకుని పోదామనుకుంటున్నాం గదూ ?

మా : (కోపంగా) నేను స్వప్నంలో సుఖపడ్డా మీకు కడుపు మంటే !—అయినా అందులోకూడా కొన్ని దారుణాలు జరిగాయిసుమా! మనం ఎంత నగకయాతనలో పడ్డామో తెలుసా ? ఈ లోకంలో మనుష్యులు మనల్ని స్వప్న జగత్తులోగూడ వెంటాడి తరిమి తరిమి వేధించారు ! మన మానేజింగ్ డైరెక్టరు—ఎన్నిరూపాల్లో, అబ్బ ! కాబూలీ వాలాగా, రౌడీగావచ్చి ఎంత క్రూరంగా హింసించా డనుకున్నావ్ ! మన ప్రభుత్వ శాసనాలే పోలీస్ ఆఫీసర్

రూపంలో, ఇంకా అనేకమంది మనవెంట పడ్డారు! ఆఖ
రికి, ఆ ముసలిపీనుగ హెడ్ గుమాస్తా ఆంజనేయులుకూడా
వదల్లేదు!

అన్న : (ఆశ్చర్యంతో) ఇవాళ మరీ ఉద్రేకంగా వున్నారే! ఏమిటా
స్వప్నం? ఏం జరిగింది? నాకుకూడా చెప్పండి!

మూ : మనల్ని వేధించాలనుకో! లోకంలో కరుణాత్ములకంటె
క్రూరులే ఎక్కువ!

అన్న : (నవ్వుతూ) ఎందుకొచ్చిన బాధ! మనంకూడా అందు
లోనే చేరితే సరిపోతుంది!

మూ : (ఆలోచించుకుంటూ) మనిషి...సహజంగా మంచివాడే
...కానీ, ఈ సంఘంలోపడి చెడిపోతున్నాడు!

అన్న : ఐతే సంఘం చెడ్డదంటారు!

మూ : (గట్టిగా) ఆ, ముమ్మాటికీ!

అన్న : (సందేహంగా) ఏమండీ, నాకు తెలియక అడుగుతాను...
మరి సంఘమంటే మనుష్యులేగా?

మూ : (కోపంగా) నీ వాదం నాకు తెలుసులే, నా అభిప్రాయం
విను! మనుష్యులు వ్యక్తిగతంగా ఎంత మంచివాళ్లైనా,
ఈ పరస్పర సంబంధాలు, సాంఘిక...(తలగోకుకుంటూ)
అదేమిటి! ఆ వ్యవస్థ! వ్య—వ—స్థ! దీనికి పునాది స్వార్థం,
ద్వేషం, భయం, తెలిసిందా? (ఉపన్యాస ధోరణిలో)
అందుకని, ఈ లోకంలో—

అన్న : (మధ్యలో అడ్డువచ్చి) ఇంకెంతసేపుంటుంది?

మూ : ఏమిటి?

అన్న : ఈ ఉపన్యాసం ?

మా : (గర్వంగా) ఇది చాలా ముఖ్యమైన విషయం ! కావాలంటే ప్రపంచానికే ప్రకటన చేస్తాను ! (హఠాత్తుగా ప్రేక్షకులను చూస్తాడు. నిశ్చేష్టుడౌతాడు. ముఖంలో ఉద్రేకం, గర్వం తగ్గి భయం, పిరికితనం కనిపిస్తాయి. అన్న పూర్ణ దగ్గరకువచ్చి రహస్యంగా) ఇంకా వాళ్ళంతా ఇక్కడే వున్నట్టుందే ? నామాట లెవరైనా విన్నారా ?

అన్న : (ముందుకువచ్చి పరీక్షించి చూసి) ఎవరు ? ఎవరూ లేరే !

మా : (నిరసనగా) హుం ! నిత్యం నంటయింటో మగ్గేవాళ్ళకు లోకభయం ఏముంటుంది? (చూపుతూ) అదుగో ! దీక్షగా మనల్ని చూస్తున్నారు ! (రహస్యంగా ఆమెతో) నా స్వప్నం ఎవరూ చూడలేదుగద ! మన పరువు ప్రతిష్ఠలు గంగపాలైపోతాయి.

అన్న : ఏమో, నాకేం తెలుస్తుంది ! నేను లోపలున్నాను !

మా : (బలవంతం చేస్తూ) అడుగు ! అడగమంటే !

అన్న : ఊహుం, నాకు తెలియదు ! మీరే అడగండి !

[ ఇద్దరూ ముందుకు వస్తారు మాణిక్యం ప్రేక్షకుల నేదో అడగబోతాడు. భయంతో గొంతు సవరించుకుంటాడు. ]

మా : (ప్రేక్షకులతో) ఏమండీ, చోద్యం చూస్తున్నారా ! (వెలితిగా నవ్వి) మా ఇంట్లో ఏముంది చెప్పండి ?

అన్న : (ఆశ్చర్యంతో) ఆం ! అరె ! ఇంకా అందరూ ఇక్కడే వున్నారే ! మీరు చెప్పింది నిజమే !

మా : (భయంగా) నా స్వప్నం చూశారేమో ! (ప్రేక్షకులతో) నేనేమీ ఎరుగను ! ఇంతసేపూ అమాయకంగా నిద్ర

పోతున్నా! అయితే...నాకొక స్వప్నం వచ్చిందీ....
మీరెవరూ చూడలేదుగదూ?

ఒకరు: చూశాం! చూశాం!

మూ: (హడలిపోయి) చూశారా. మీరంతా? (అన్నపూర్ణతో)
నాకు చాలా భయంగావుంది! ఇప్పుడెలాగ? (ప్రేక్షకులతో) ఇది జరిగిందికాదు, స్వప్నం! (పేలవంగా నవ్వుతూ)
నాకు రోజూ అలాంటి స్వప్నాలే వస్తుంటాయి! అంతా
ఒక స్వప్నం! (అన్నపూర్ణతో) కదూ?

అన్న: (ప్రేక్షకులతో) మీరేమీ అనుకోకండి! వారి కిదొక
దురలవాటు!

మూ: చూడండి! అందులో నేను....నిజంగా....నేను....
అలాంటి పనులెప్పుడూ చెయ్యను! అలా సంపాదించాలని, సుఖపడాలని నా కసలు ఆశేలేదు! (సూటిగా)
ఇందులో మీకు తెలియని దేముంది? (పెద్దమనిషిలాగ)
అప్పుడే ఐదేళ్ళయింది నేను గుమాస్తాగాచేరి! మా అధి
కార్లకు నేనంటే ఎంతో గౌరవం! హెడ్ గుమాస్తా
అంజనేయులున్నాడే, అతను మా నాన్నకాలంనాటి
వాడు; అంటే, మా కుటుంబం చాలా పెద్దది! (సిగ్గు
పడుతూ) ఇప్పుడు చితికిపోయిందిలెండి!

ఇంకొకరు: మీ స్వప్నం సహజమే!

మూ: (సంతృప్తిగా) ఇందులో మీకు తెలియని దేముంది?
హెడ్ గుమాస్తా నా ఆదర్శం! అతను అప్పుడే చాలా
వృద్ధుడైపోయాడూ....రేపో, మాపో....దేవుడు దయ

తలిస్తే నాకే ఆ ఉద్యోగం వస్తుంది! అంతేకాదు... ఈ రోజు నాకు ఇంక్రిమెంట్ మూడు రూపాయలు!

మరొకరు: ఐతే రోజూ కలలుగనటమేనా పూవని?

మా: (నిస్సవసుతూ) ఏం చెయ్యమంటారండీ! స్వప్నాలపై నెక్కి— పోయి స్వర్గనరకాలు చూసి వస్తుంటాను! మా జీవితంలో చెప్పుకోదగ్గ సంఘటనే వుండదు! ఈ ఎడారిని స్వప్నపుష్పాలతో అలంకరించుకుని, హాయిగా, ఊహాస్వర్గం నిర్మించుకొని సంతోషంగా — (భావనలో మునిగిపోతాడు.)

అన్న: (వేళాకోళంచేస్తూ) వొట్టి వెర్రిమనిషి!

మా: (అన్నపూర్ణమీద ఆగ్రహంతో) ఆఁ! ఏమన్నావ్! ఇంత మంది ముందే! (ప్రేక్షకులతో వినయంగా) ఏమనుకోకండి! పదిమందిలో అయినా భర్తగౌరవం నిలబెట్టాలని తెలియదు! గాని, పతిభక్తి అపరిమితం!

ఒకరు: ఇప్పుడు సంతోషంగా వుందా!

మా: నిజం చెప్పనా? ఇందులో పత్రికలకెక్కదగిన ఎవరూ లేరు గదా; వి—లే—ఖ—రు—లు! ఉంటే బహిరంగంగా ప్రకటించేస్తాను! నా జీవితమే స్వప్నాలతో నిండిపోయింది; మీకు తెలియనిదేముంది?

ఇంకొకరు: తెలుసు! తెలుసు!

మా: స్వప్నంలో ఏదో సాహసించి చేద్దామనుకున్నానుగాని, నేను చాలా భయస్తుణ్ణి! నన్ను నమ్మండి! నేను నిరపరాధిని! నేను సర్వథా బుధజనవిధేయుణ్ణి!

అన్న : ఊఁ, ఇంకేం ! కాఫీ చల్లారిపోయింది ! మీ సంభాషణల కంతు లేదేమండీ ?

మా : (అన్నపూర్ణమీద ఆగ్రహంతో) ఏమిటీ గోల ? పెద్ద మనుష్యు లింటికి వచ్చినప్పుడేనా ? (ప్రేక్షకులతో) నాండండీ! ఈ స్వప్న వృత్తాంతం ఎవ్వరితోనూ అనకండేం! అదే నా భయం ! ఇవన్నీ వాస్తికలలు, కల్పిత సుఖాలు ! గాలిమేడలు !

కృష్ణ : (పరుగెత్తుకుంటూ వచ్చి) అమ్మా ! అమ్మా ! ఏమిటమ్మా అక్కడ మాట్లాడుతున్నారు ? ఎవరితో ?

అన్న . ఏమీలేదు నాయనా, వారంతా మన ఇంటికి వచ్చారు—

కృష్ణ : (తేరిపారచూస్తూ) ఎవరు? ఎవరూ లేరే !

మా : (నవ్వుతూ) మరీ చిన్నతనం ! చూడరా, కన్పిస్తారు !

కృష్ణ : (మళ్ళీ అన్నివైపులు చూసి) ఎవ్వరూ లేరు ! ఏమిటమ్మా నన్నాటలు పట్టిస్తున్నారా ?

మా : (అన్నపూర్ణతో) పసిబిడ్డ ! వాడికి లోకమేం కన్పిస్తుంది ?,

కృష్ణ : (బిక్క మొహంతో) నాకేం తెలియడంలేదు !

మా : (స్వప్నం జ్ఞాపకం తెచ్చుకుంటూ) ఎన్ని అలంకారాలు ! కృష్ణకొక సైకిలు, బొటు, బూటు అన్నీ కొన్నాం !

కృష్ణ : (నిజమనుకుని, ఆశతో) ఏవీ ! ఎక్కడున్నై ?

మా : (ఊహించుకుంటూ) ఇంకా వున్నై ! రేడియోకూడా కొన్నాం !

కృష్ణ : (ఆదుర్దాగా) కొన్నారా! ఎక్కడ? పదనాన్నా! ఇప్పుడు పోయి తీసుకొద్దాం!

మా : (ఆనందంగా) ఇంకా ఎన్నెన్నో వున్నై!

కృష్ణ : (తండ్రి, తల్లి చేతులు పట్టుకుని లాగుతూ) ఏవి నాన్నా? ఎక్కడున్నై!

అన్న : (దిగులుగా నవ్వుతూ) షాపుల్లో వున్నై! స్వప్నాల్లో వున్నై! తెలిసిందా?

కృష్ణ : (బిక్కముఖంపెట్టి) నిజంగా లేవూ? నా కాశపెట్టి ఏడుస్తున్నారేం?

మా : (ఏడుపు దాచుకోడానికి పెద్దగానవ్వి) ఎలా వుంటాయి? డబ్బేది? (వేళ్ళు మీటుతూ) డబ్బు? డబ్బురా! డబ్బేది?

—[సంపూర్ణం]—

—*—

# పాటలు

2.

చక్కని ఈ లోకంలో
సౌఖ్యం కరువైనదా ?
స్వేచ్ఛాయుత జీవితాన
చిరునవ్వే కనపడదా ?

నీ హృదయం ప్రతిక్షణాన
ఘోషించును నరనరాన,
"అనుభవించ నివ్వరా
అమృత మధుర జీవితం !"

నీతి ఖరీదెక్కువే
నీలో నిరుపేదవే,
పరువూ, మర్యాద, మంచి
ప్రభువులకే చెల్లులే !

పరువే బరువైన బ్రతుకు,
నవ్వే కరువైన బ్రతుకు
అపరాధం, అవమానం
ఎన్నైనా సహిస్తుంది,

అన్నిటికీ తెగిస్తుంది !
చక్కని ఈ లోకంలో
సౌఖ్యం కరువైనదా ?
స్వేచ్ఛాయుత జీవితాన
చిరునవ్వే కనపడదా ?

[ ఈపాట స్వాప్నిక జీవితం మొదటి అంకంముందు పాడాలి. ]

4. ఆ నీరస సంసారపు
ఆక్రందన విన్నావా !
ఆ నిరాశ తలుపు తెరిచి
నరకమదే చూశావా !

ఆ చితికిన జీవితాల
ఆవేదన విన్నావా !
ఆ చీలిన గుండె తెరిచి
ఆ ప్రళయం చూశావా !

ఆయువుడిగి ఆశవిడుచు
ఆ రోదన విన్నావా !
ఆకలి శోకాల విలయ
తాండవమదె చూశావా !

లోకమంత ఘోషించే
శోకతూర్య రావంతో,
మృత్యువు మన గడపలెక్కి
గుండెలెక్కి దహిస్తోంది !

ఆ నీరస సంసారపు
ఆక్రందన విన్నావా !
ఆ నిరాశ తలుపు తెరిచి
నరకమదే చూశావా !

[ ఈపాట స్వాప్నిక జీవితం రెండవ దృశ్యం తర్వాత పాడాలి. ]

౨. భయం భయం బ్రతుకు భయం !
భయం బ్రతుకు భయం భయం !

అన్నా ! మనకీ లోకం
పన్నిన పద్మవ్యూహం !

స్వప్నంలో స్వర్గసుఖం
సౌభాగ్యం, సౌందర్యం !

స్వప్నలోక మాశ్రయించి
జీవించే సంసారం
ఈ వాస్తవ జీవితాగ్ని
శిఖల దగ్ధమౌను సుమా !

స్వప్నసుఖం మన భ్రాంతి
సత్యదీక్ష మనకు శాంతి !

భీరువులో ! పీడితులో !
పెరిగి రండి మానవులై,
చైతన్య జ్యోతులార !
జగతిని శాసించండి !

భయం భయం బ్రతుకు భయం !
భయం బ్రతుకు భయం భయం !

[ ఈపాట స్వాప్నికజీవితం ముగిసిన తర్వాత పాడాలి. ]

౩. ఖైదులోన ప్రాణం రగిలేనా !
ఖైదుబయట ప్రజలే కుమిలేనా !

ఉన్నవారు నిలబెట్టిన నీతులు
లేనివారి బంధించే ఖైదులు,
లోకం విశాల కారాగారం
శోకం బ్రతుకే దుర్భరభారం !

ఖైదులోన ప్రాణం రగిలేనా !
ఖైదుబయట ప్రజలే కుమిలేనా !

జగతిలోన ఒక ఖైదీవున్నా
జనులందరికీ అవమానంరా !
మానవుడొక్కడు ఆకలిగొన్నా
మాతృభూమికే అపరాధంరా !

ఖైదులోన ప్రాణం రగిలేనా !
ఖైదుబయట ప్రజలే కుమిలేనా !

ఆకలితో అల్లాడుటయేనా !
అంతరాత్మ క్షోభించుటయేనా !

ఖైదులోన ప్రాణం రగిలేనా !
ఖైదుబయట ప్రజలే కుమిలేనా !

[ ఈపాట కృష్ణ జీవితంలో మొదటిదృశ్యం తర్వాత పాడాలి. ]

---

## మా నా ట కా లు

| | | |
|---|---|---|
| పాలేరు | బోయిభీమన్న | 1- 8-0 |
| కూలిరాజు | ,, | 1- 8-0 |
| అసూయ | ,, | 0-12-0 |
| పల్లెపడుచు | పినిశెట్టి శ్రీరామమూర్తి | 1- 8-0 |
| అన్నాచెల్లెలు | ,, | 1- 8-0 |
| అడది, రిక్షావాడు | ,, | 1- 4-0 |
| నాటకం | డి. వి. నరసరాజు | 1- 4-0 |
| అంతర్వాణి | ,, | 1- 4-0 |
| ఆత్మహత్య | ,, | 1- 4-0 |
| ఆత్మవంచన | బుచ్చిబాబు | 1- 4-0 |
| దారినపొయ్యే దానయ్య | ,, | 1- 4-0 |
| తీరని కోరికలు | 'శ్రీ వాత్సవ' | 1- 4-0 |
| వారసురాలు | 'శివం' | 1- 4-0 |
| గాలిమేడలు | అనిశెట్టి | 1- 4-0 |
| మా వూరు | ,, | 1- 4-0 |
| మానవుడు | ,, | 1- 4-0 |
| ఇనపతెరలు | కొప్పరపు సుబ్బారావు | 1- 4-0 |

దేశికవితామండలి : విజయవాడ

GALI MEDALU
ANISETTY



A DESI PUBLICATION
PRICE - Rs : ONE As : FOUR